# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 16-5-1979 | సంచిక 14


—* ఈ సంచికలో *—



1_6_79 సంచికలో మధ్యమాంబా గరయసీ, శాపంతలో త్తర రామచరితములు మొదలగునవి ఉంటాయి.


—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10_00.
అర్థసంవత్సరమునకు రు 5_50.

విడిప్రతి 50 పై.

# విశ్వశ్రేయః కావ్యం

— శ్రీ సోమసుందర్.

విశ్వశ్రేయః కావ్యం
తదదోషౌ పరిక్ష్యౌచవాగర్థౌ
శృంగారరసప్రవృత్తిః
సాధ్యో హి రసో యథాతథం కవిభిః

అనే ఉద్ఘాటనచేసిన మహనీయుడు ఆంధ్రుల ఆదికవి నన్నయ్య. ఈ సూక్తిని అంతకుపూర్వం ఆలంకారికు లెవ్వరూ చర్చించినట్లు కనిపించదు. అంటేవా రెవరూ కావ్యం ద్వారా విశ్వశ్రేయాన్ని అపేక్షించలేదనికాదు. కాని ఆలంకారికులు ప్రధానంగా సౌందర్యవాదులు. ప్రయోజనం వారి దృష్టిలో గౌణమే. 'కావ్యం యశసే, అర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయే, అంటూ చెప్పిన మహనీయుడు కావ్యానికి పరమప్రయోజనాలుగా చతుర్విధపురుషార్థాలనూ నిర్వచించాడు.

విశ్వశ్రేయః కావ్యం అనేసూక్తిలో ఉన్నపదాలు మూడే. కావ్యం విశ్వశ్రేయాన్ని అపేక్షించాలని దీని అర్థం. ఈసూక్తిని వివరించుకుందుకు ఈ పదాల అర్థస్వరూపాన్ని కొంత విచికిత్స చేసుకోవాలి.

విశ్వం అనే పదానికి సాధారణార్థం–లోకం అని అంటే ఆ మహనీయుడు ప్రపంచానికీ, మానవలోకానికీ విశ్వాన్ని పర్యాయపదంగా ప్రయోగించాడన్నమాట. కాని ఈ విశ్వం అనేపదం ఆధునిక భావార్థంలో కొంత విపరిణామం పొందింది. దీనిని లోకం అనే పరిమితార్థంలో కాక, విశాలార్థంలో మన కాలం ప్రయోగిస్తోంది. ఆధునిక వైజ్ఞానిక పరిశోధనా విజయపరంపర – ఈపదాన్ని మనకు మరింత సన్నిహితం చేస్తూంది. సమస్త గ్రహగోళాలతోనూ, నిత్య పరిభ్రమణశీలమైన యూనివర్స్‌కు సమానార్థంగా విశ్వం అనే పదం వాడబడుతోంది.

ఐనప్పుడు మనం ఒక చిటిపొటి కావ్యరచనద్వారా గ్రహచారగోచారాల సమస్తశ్రేయాన్ని అపేక్షిస్తున్నామనుకోవడం – శిరోజంతో గజరాజును బంధించడం వంటిదే అవుతుంది. కనక ఈ పదానికి ప్రస్తుతార్థంలో కాక ప్రాచీనుల పరిమితార్థంలోనే మన అవగాహనను కేంద్రీకరించాలి.

ప్రతిపదానికీ కాలగతిలో కొంత మార్పు వస్తుంది. ఆయా సామాజిక సంబంధాలలో ఆయా పదాలు కలిగించే అర్థావగాహన ప్రమాణాలలో మార్పులు వస్తాయి. సమాజమూ, సామాజికులూ ఎప్పుడూ ఏమార్పూ పొందని స్థాణువులు కారు, కనక సామాజిక అంతస్సంబంధాలను అనుసరించి ఒకపదమో ఒక సూత్రమో కలిగించే కాంతిరేఖలలో సైతం మార్పు రాకతప్పదు.

నన్నయ్యగారు విశ్వం అనే పదానికి నిస్సందేహంగా లోకం అనే అర్థాన్నే నిర్దేశించారనుకుందాం. ప్రాచీనభారతీయుల అవగాహనలో విశ్వం అంటే జంబూద్వీపే భరతవర్షే మాత్రమే. ఇంకా స్పష్టంగా చెప్పుకోవాలని గంగా గోదావరీ మధ్యదేశే అని కూడా పరిమిత పరుచుకొన్నారు. అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా, హిమాలయో నామ నగాధిరాజః–పూర్వాపరౌ వారినిధీ విగాహ్య స్థితః పృథివ్యా ఇవ మానదండః!' అని కాళిదాసుగారు చెప్పాడు; కనక దానికి తిరుగులేదు. పూర్వాపరవార్నిధులను తాసుకొని హిమాలయ పర్వతపంక్తి ప్రాక్పశ్చిమ భూభాగాలకు కొలతకర్రగా పరచుకొని ఉందా, లేదా అని పరీక్షించినవాడులేడు. అట్టి హిమాలయ పర్వతపంక్తి ఉత్తరసరిహద్దుగాను, పూర్వాపర సాగరవేలలతోనూ ఉన్న భరతవర్షమే నన్నయ్యగారి విశ్వం. విశ్వం విశ్వస్థులతో నిండినదనీ, అవిశ్వస్థులకు కళ్యాణం చేకూర్చేదిగా కావ్యం ఉండాలనీ నిర్దేశించినట్లు స్పష్టమే.

ఇక ఈసూక్తిలోని రెండోపదం శ్రేయః అనేది. దానికి మోనియర్ విలియమ్స్ అసంఖ్యాక–అర్థాలను తెలిపాడు. అందులో మోక్షం అనే అర్థం ప్రధానమైనది. అదే ఇక్కడ పరిగ్రాహ్యమైతే– కావ్యం ద్వారా లోకానికి మోక్షమార్గాన్ని నిర్దేశించాలన్నది ఋషి సంకల్పంగా అవగాహనచేసుకోవాలి. మోక్షానికి ఆధునికార్థంలో సర్వసంకుల సమస్యాబంధ విముక్తిగా స్వీకార్యమైతే మనకూ గ్రాహ్యమే! కాని ప్రాచీనుల దృష్టిలో మోక్షం ఐహిక సంబంధికాదు. పునర్జన్మరహితమైన పరబ్రహ్మ సాయుజ్యం. అంటే ఆత్మపరమాత్మతో సంధానం కావడం. అంటే కావ్యం లోకస్థులకు ఉత్తమపథ నిర్దేశం చేయడంద్వారా కైవల్యప్రాప్తికి దోహదం చేయాలని వారుద్దేశించిన అర్థం.

వ్యాస వాల్మీకులైనా, కాళిదాసాదులైనా, నన్నయాదులైనా తమ కన్నుల ముందున్న సాంఘిక వ్యవస్థ త్రికాలాబాధితంగా సువ్యవస్థితమై ఉంటుందని ఆశించారు. సామాజిక సంబంధాలలోగాని, ఉత్పత్తి సాధనాలలోగాని, వారు సాధించిన దానికన్న కొత్తమార్పులేమీ పొడసూపకుండా ప్రళయాంతంవరకూ లోకం అనుస్యూతంగా సాగుతుందనే విశ్వసించారు. ఈ విశ్వాసానికి ఆధారం తార్కిక పరిశీలనకాదు. హేతుబద్ధమైన విచారణకాదు. కార్యకారణాలకతీతమైన భ్రమ. ఆభ్రమతోనే వారి కాలాల రాజరిక వ్యవస్థ సుస్థిరంగా నిలచే శాశ్వత బ్రహ్మకల్ప మనుకొన్నారు. కను

కనే ఆదర్శపురుషులైన పూర్వరాజుల చరిత్రలను సమకాలీనరాజులకు చెప్పేరు. ఆ కథలనే ప్రజలూ విన్నారు. రాజే లోకానికి కీలకమైనవాడు కనక — తద్వారా విశ్వశ్రేయం సాధించా మనే విశ్వసించారు.

కాని నేడు మనం బ్రతుకుతూన్న ప్రపంచం ఈ భ్రమలకు ఆస్కారం కలిగించడం లేదు. ఆర్థిక సాంఘిక వ్యవస్థలు నిత్యపరిణామశీలములై పురోగమించడం మన కన్నులముందే జరుగుతోంది. ఉత్పత్తిసాధనాల క్రమపరిణామం-సామాజిక సంబంధాలను పూర్తిగా మార్చివేస్తూంది. రాజరిక వ్యవస్థ సమూలంగా మటుమాయమైంది. భూస్వామ్యవ్యవస్థ కొనఊపిరితో కొట్టుకుంటోంది. పెట్టుబడిదారీ వ్యవస్థాజన్యమైన సాంఘిక జీవనస్థితి సర్వరంగాలలోనూ ఆవిష్కృత మవుతోంది. పెట్టుబడిదారీ వ్యవస్థ అంటేనే ఉత్పత్తిసాధనాల విస్తృతితో పారిశ్రామిక కేంద్రాలు నెలకొల్పడ మనిభావం. అదే ఆర్థికవ్యవస్థను అదుపులో ఉంచు పాలనా వ్యవస్థపై అజమాయిషీ కలిగి ఉంటుంది.

ఈ కొత్త ఉత్పత్తికేంద్రాలు పాత సామాజిక మానవ సంబంధాలను వర్ధిల్లనీయవు. చిరకాలంగా రాజరికవ్యవస్థ వర్ధిల్లిన మన భరతవర్షంలో — సర్వపరిణామాలతోనూ, నూత్నవ్యవస్థ పెంపొందుతూండడం స్పష్టంగా కనిపిస్తున్నదే! మనువుకాలంనుంచో, వాని ప్రపితామహుడి కాలంనుంచో చెక్కుచెదరకుండా నిలచిఉన్న పూర్వసాంఘిక సంబంధాలు తారు మారయ్యాయి. వర్ణాశ్రమవ్యవస్థ ఒక్కసారి తుదముట్ట కదిలింది. సమాజంలో వర్గవిభేదం రూపొందడమే ఈ వ్యవస్థప్రాథమిక లక్షణం! అంతకు మినహా తత్పూర్వ సాంఘిక వ్యత్యాసాలను మననియదు.

ఆధునిక వైజ్ఞానికశాస్త్రం సాధించిన తొలి విజయాలుగా, భారీ వస్తూత్పత్తి కేంద్రాలు నెలకొల్పబడడంతో, ఆవిర్భవించిన వర్గవైవిధ్యం-ఈ శతాబ్దంలో వర్గవైరుధ్యంగా పరిణత మవుతోంది. అదే మన సర్వజీవనరంగాలనూ నిర్ణయిస్తోంది. అంటే ఇక్కడే మనం మళ్లీ మొదటికి వచ్చి ఆలోచించవలసిన అవసరం ఆసన్నమవుతోందన్నమాట! మార్పుపొందిన సామాజిక సంబంధాలలో విశ్వశ్రేయః కావ్యం, అనే ఆదర్శవంతమైన సూక్తి ప్రసరించే కాంతికళికల తీరుతెన్నులేమిటి? ఇదీ మౌలికమైన ప్రశ్న! కావ్యం విశ్వశ్రేయోదాయకంగా ఉండాలనడంలో ఎవరికీ ఎట్టి అభ్యంతరమూ ఉండదు. కాని ఈ విశ్వానికి మనమిచ్చే అర్థం విషయంలోకూడ ఏమరుపాటు పనికిరాదు. శ్రేయస్సు అనేమాటను మనం — ముక్తి మోక్షం అనే ఆముష్మికార్థంలో ప్రయోగించడంలేదనేదికూడా ఇక్కడే నిర్ధరించుకోవాలి. ముక్తి, మోక్షం, కైవల్యం ఇత్యాది మత, తాత్త్వికపరమైన అర్థాలను మనలౌకిక రాజ్యాంగం వ్యక్తిగతాలుగానే తప్ప-సమాజ పరాలుగా స్వీకరించదు.

శ్రేయం ఏది? ఎవరికి? అనేప్రశ్నలున్నాయి. శ్రేయః పదాన్ని మానవ కళ్యాణానికీ,శుభానికి పర్యాయపదంగా మనం వాడుతున్నపుడు ఈ ప్రశ్నలకు జవాబుదారీ తప్పదు. ఈవిశ్వం అనేపాత పదంలో వర్గవిభక్తమైన వర్తమానసమాజంలోని మానవులంతా ఇమిడిపోవడానికి అవకాశం లేకపోలేదు. అంటే — లేడిపిల్లను అంగిట బంధించి పరాచికాలాడుతున్న పులిశ్రేయాన్ని మనకావ్యం అపేక్షించాలా? లేక కొనఊపిరితో విలవిలలాడుతున్న లేడిపిల్ల శ్రేయాన్ని కాంక్షించడం కావ్యధర్మమా అనేది ముందు తేల్చుకోవాల్సిన ప్రశ్న!

కనుక ఇక్కడే మనం — 'బహుజన సుఖాయ! బహుజన హితాయ! అనే పరమనిర్దిష్టసూక్తిని మనకళా సారస్వతాదులకు చూడామణిగా అనుసంధించుకోవాల్సివుంది. ఈ బహుజనపదంలో పీడించేవాడుకూడా ఇమిడే అవకాశం ఉండా లేదు. కేవలం బహుసంఖ్యాకులైన పీడితుల, బాధితుల, దళితుల శ్రేణిమాత్రమే అని స్పష్టపరుస్తుంది. కనుక ,కావ్యధర్మం బహుజన శ్రేయఃకరం కావాలని ఆకాంక్షించడం దురాశ కాదు. అల్పసంఖ్యాకుల సుఖభోగ వ్యాపారానికి కావ్యకళ అంకితం కారాదనీ బహుజనుల హితాన్ని సుఖాన్నీ కోరేదిగా నిర్దేశితం కావాలని మనం — 'విశ్వశ్రేయఃకావ్యం' అనే అభిభాషణకు భాష్యం చెప్పుకోవాలి.

కావ్యాది సర్వలలితకళలూ వ్యక్తిప్రతిభాజన్యాలే. వ్యక్తి సమాజనిష్ఠుడు. కనక కళలు సమాజధర్మాలే! సామాజిక పరిస్థితుల ననుసరించే కళాస్రష్ట తన సృజనకు స్వరూప స్వభావాలను తీర్చుకుంటాడు. ప్రతిభావంతుడైన కవి తన మనఃకార్మికశాలలో ఉత్పత్తయ్యే అక్షరబద్ధమైన కళాస్వరూపాన్ని సామాజికుల సుఖంకోసమూ, హితంకోసమూ కేంద్రీకరిస్తాడన్నది పిండితార్థం. కవిత్వం ఎన్నడూ బౌద్ధికం కాదు; హార్దికం. కాని కవి వ్యుత్పన్నతా భూమికలో తనకాలం విస్పష్టంచేసిన సామాజిక సంబంధాలప్రమేయం ఉండి తీరుతుంది. పరిశీలించడంద్వారా గతాగతాల రూపురేఖలను కవి దర్శించగలుగుతాడు. కవిత్రికాల వేదిత్వం అలవర్చుకుంటాడు. అప్పుడే అతడు ప్రజ్ఞాచక్షువు కాగలుగుతాడు. అట్టివాడే ఆనంద వర్ధనాచార్యుడు నిర్వచించిన 'కవి రేవ ప్రజాపతి' పదార్హుడు కాగలడు.

యోచన, విశ్వాసం, దర్శనం, ప్రదర్శనం సృజన-అనే పంచశీలాలు కలవాడే పరిపూర్ణకవి వాచ్యుడు కాగలడు. ఇందులో ఏపార్శ్వం లోపించినా సంపూర్ణకావ్యబింబానికి మొర్రు ఏర్పడినట్లే. అలాంటి పూర్ణప్రజ్ఞాశాలి తానుగా కావ్యధర్మాలకు కొత్తరేకలు కూర్చుకుంటాడు. వర్ధమాన సామాజికుల

శ్రేయస్సు నపేక్షించి సహృదయ హృదయాలకు జవజీవాలు ప్రోదిచేసేదిగా తనకావ్య సృజన సాగాలని వాంఛిస్తాడు.

'నా నృషిః కురుతే కావ్యం' అనే ప్రాచీన సూక్తినిగాని, కవిః క్రాంతదర్శీ సర్వదృక్ అనే సూక్తినిగాని–సామాజిక సంబంధాల సందర్భాన్నిబట్టి కవినిశిత దృక్కు అన్వయించుకుంటుంది.

వ్యక్తిగత ప్రతిభపై కావ్యకళా స్వరూపం ఆధారపడుతుందని మనం అంగీకరించిన మరుక్షణంలోనే దాని జీవలక్షణంనవ్యత అని విస్పష్టమవుతుంది. అంటే ఒకకవి తనకాలంవరకూ అనుస్యూతంగావచ్చిన కావ్యస్వరూప స్వభావాలకు యథాతథంగా ప్రతిబింబాలు దించడంగాక, సంప్రదాయభూతలంనుంచి తానుగా వారసత్వం అందిపుచ్చుకొని, తన వ్యక్తిత్వానికి రక్తపుష్టి చేకూర్చుకొన్న వ్యుత్పన్నతనుంచి తేలిన నవ్యనవనీతంతో కావ్యసృజన సాగించగలడన్నది అవగతమవుతుంది. అంటే సంప్రదాయం సారవంతమైన భూతలంకాగా కవివ్యక్తిత్వం ఆసారాన్నిగ్రోలి ఏపుగా పెరిగే భూజమై, ప్రతిభాజన్య కుసుమ కాంతుల్నీ సౌరభాల్నీ వెదజల్లగలదని భావం.

వారసత్వం అందించిన సకల బలవర్ధకాలనూ రక్తనిష్ఠం చేసుకుంటూనే – ప్రతిభాశాలి స్వీయముఖద్యుతుల్ని ప్రసరించా లన్నదే ఎవరు కోరేదైనా! లోకోత్తర వర్ణనానిపుణత్వం నవనవోన్మేష శాలినీ ప్రతిభవల్ల సముపలభ్యమన్న ఆర్షవాక్కు నిరర్థకమైనదికాదు. ఏప్రతిభావంతుడూ తనకాలంవరకూ ఉన్న వాటికే పునరుక్తిరూపాలనో, ప్రతిధ్వనులనో మళ్లీమళ్లీ సృష్టించడం సృజనకాబోదు! సంప్రదాయ శ్రోత్రియత్వం సృజనశక్తికి భ్రష్టత కలిగించకుండా విడువదు.

నిన్నటివరకూ మనకావ్యం మధ్యయుగాల లక్షణమైన మతసంబంధంతో పెనగిపోయింది. అందులోంచి వర్తమాన విశ్వశ్రేయం క్వాచిత్కంగానే లభిస్తుంది. నేటివర్గ విభక్తమైన సమాజంలో అధికసంఖ్యాకుల పీడితవర్గం శ్రమజీవన భారవహమై క్రుంగిపోతోంది. అట్టిస్థితిలో బహుజనహితాయ బహుజన సుఖాయ అని త్రికరణశుద్ధిగా సంకల్పించుకొన్న కవి నూత్న సామాజిక సంబంధాలను పరిశీలించి, నూతనావకాశాలను పరిశోధించి, వర్తమానలోక శ్రేయః కరాలను సాధించితీరవలసిందే!

ఒకజాతి – వేలాది వత్సరాల చరిత్ర సముపార్జించిన సంప్రదాయం, ఆజాతి సృష్టించుకొని పోషించుకొనే భాషలో అంతర్నిబిడంగా జీవిస్తుంది. ఆ జాతి నుంచి ఉద్భూతమైన ప్రతిభాశాలి ఆభాషలో తనకుగల సదుపాయాలను తానుగా అన్వేషించుకుంటాడు. బహుజన హితంకర కావ్యావసరాలను పరిశోధించి అవిష్కరిస్తాడు. అదే అతని నవ్య కావ్యసృజనకు పోషకం కాగలదు. అలాంటి నిశితదృక్కు లేనివానికి సంప్రదాయం–తొలగించుకోలేని భారంగా తయారవుతుంది. అతని పరిమిత ప్రతిభను అణచివేస్తుంది. అతడు సంప్రదాయ భీరువుగా మారి కేవల పాండిత్యంతో జడప్రాయుడవుతాడు. యథాపూర్వక ప్రతిబింబాలను తయారుచేస్తూ ఊపిరి పీలుస్తాడు,

ప్రతిభాశాలి యగు కవికి దేశకాల పరిస్థితుల దర్శనం ఉండితీరాలని మనపూర్వులే కంఠోక్తిగా శాసించారు. ప్రతిభావంతుని కావ్యం వర్తమాన సామాజిక పరిణామానికి చోదకశక్తిగా తనరారగలుగుతుందని మన మీనాడు కొత్తగా చెప్పుకోవలసిన పని లేదు. సంప్రదాయం సారభూత కేదారంగా దోహదంచేసిన ప్రతిభావంతునికే యిది సాధ్యం. మృతగతం వర్తమాన ప్రతిభావంతుని ముఖకాంతిపై తిమోచ్ఛాదనమైతే, ఈశక్తి ప్రదర్శితంకాదు.

లోకవృత్తాన్ని గమనాన్ని అవగాహన చేసుకోగలిగే చారిత్రకదృష్టి వర్తమాన ప్రతిభాశాలికి వ్యుత్పన్నతా భూమిక. చారిత్రక దృష్టికలవాడు గతాన్ని గత దృష్టితోనే పరిశీలించి తృప్తిపొందలేడు. పరప్రత్యయ నేయ బుద్ధితో చేసే దర్శనం–శ్రోత్రియ బుద్ధి జాడ్యానికి దారితీస్తుంది. వర్తమాన దర్శనంతో సమకాలిక తాత్త్విక వైజ్ఞానికావగాహనతో, ఆధునిక సామాజిక సంబంధాల అనుశీలనతో, గతాంశాలను సమీక్షించుకోగలిగేవాడు మంచి చెడ్డల వేర్పాటుకు పూనుకోగలుగుతాడు. ఆధునికజీవన విధానాన్ని కలవరపరచే ఆధునికవర్గ సమాజాన్ని శాస్త్రావగాహనతో పరిశీలించగలుగుతాడు. అప్పుడే బహుజన శ్రేయస్కర కావ్యాన్ని సృష్టించగలుగుతాడు.

చివరగా తేల్చుకోవలసిన ప్రశ్న ఒకటుంది. కావ్యానికి శ్రేయమొక్కటే జీవలక్షణమా? కాదు. ప్రేయంకూడా ప్రధాన జీవనధాతువే! ప్రీతి రేవ ప్రధానం–, అని ఆనంద వర్ధనాచార్యుడన్న సూక్తిని ఒక కొసకులాగి చూడకూడదు. శ్రేయఃప్రేయాలు ఓతప్రోతాలుగా కావ్యాంబరానికి జిలుగు వెలుగు లందిస్తాయి, మన్నిక చేకూరుస్తాయి.

ఆ సంధానక్రియ అప్రతిభులకు అలవడదు. కళా ప్రతిభ వ్యగ్యమైనవాడు కేవలహస్తవాసిపై బ్రతుకుతాడు. కవిత్వాది కళలను చేతిపరిశ్రమల స్థాయికి దిగజారుస్తాడు. అట్టివాడు ఉత్పత్తిచేసే కావ్యం– సహృదయ హృదయ తలంలో ఆవాసం చేయదు. గతలోకంవైపుగా చూపులు వెనుకకు త్రిప్పుకొన్న వాడి కావ్యాల నేపథ్యంలో సమకాలీన జాతి జీవనాడి ప్రతిస్పందించదు.

[ ఆకాశవాణి – విజయవాడ కేంద్రంవారి సౌజన్యంతో – ]

# ప్రసన్న కుసుమాయుధం - తత్త్వదర్శనం

— శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

(12 వ సంచిక తరువాయి)

ప్రేమాభిరామము :- దేవలోకమున ఊర్వశి అపురూపపు లావణ్యవతి. ఆమె గొప్పతనమునుగూర్చి తెల్పుచు కవి

'కమలాగ్రాసను నెన్ని కల్పముల సం
కల్పంబు సిద్ధించెనో!
అమృతాంశుప్రభు నెన్ని లోకముల గా
ఢాన్వేషమీడేరెనో!
కమలాజిహ్మగు నెన్ని కన్నులపరీ
క్షల్ సార్థకంబయ్యెనో!
కమనీయాకృతి యొక్కడూర్వశిగ సా
క్షాత్కారమయ్యెం దివిన్'

అని అంటాడు.

శ్రీనాథుడాకాంతకే 'యెద మీదు గట్టి' నాడు. 'ఆమెయందము నాపోశన మెత్తినప్పుడే' శ్రీనాథుడు శ్రీనాథుడై మన్మథుని శృంగభంగము చేయును. అందుకే వైకుంఠమునకు పురూరవు డేగుట గని ఇంద్రు డూర్వశికి స్వయంవరము చాటెను. దాని కెందరెందరో వచ్చిరి. ఊర్వశి 'మరుడు శిరసావహించిన మకుటము'గా సభలో నిలిచి, కలయజూచి శ్రీనాథుని వరించెను. 'మారదార రూపోపమాకార యామె_ మారయామాత్యకూర్మికుమారుడతడు'_'ఇరువురును స్మరవర ప్రసాదులు.' దానితో శ్రీనాథుడు ధన్యుడయినాడు.

అప్పుడు! ...

కోటివేల్పులు స్మరధను ష్కోటిలోనఁ
గొలువుదీరిన చెలువునఁ దెలుగుసుకవి
చిత్తజస్నిగ్ధ సంకల్ప సిద్ధుడయ్యె
రసపరబ్రహ్మ పట్టభద్రత గణించె'(30ప)

నని కవి వర్ణించినాడు.

ధనుష్కోటి ఒక ప్రసిద్ధ పుణ్యక్షేత్రము. ఇక్కడ మన్మథుని ధనుష్కోటిలో దేవతలెల్లరు కొలువుదీరినట్లుగా శ్రీనాథుడు మన్మథుని సంకల్పసిద్ధుడై రసపరబ్రహ్మయందు పట్టభద్రుడయ్యెననుటలో శృంగారరస బ్రహ్మస్వరూపుడై ఊర్వశితో అద్వైతస్థితి నందెను.

కాల మిట్లు కొంతసాగగా ధూర్జటి మహాకవి పట్టిన 'మారహం వీరమహావ్రతము'నకు బొమ్మని ఇంద్రు డూర్వశికాజ్ఞయిచ్చెను. దానితో 'పంచశరవంచితేంద్రియ పంచకుండు' అయిన శ్రీనాథునకు తిప్పలయ్యెను. ఆతని నోదార్చుటకు తెలుగురాయడు, బెండపూడి అన్నయ్య, విస్సనమంత్రులు, అవచి తిప్పయ, ప్రౌఢరాయలు, వినుకొండ వల్లభుడు, సింగమంత్రి మొదలయినవారు వచ్చినారట!

ఆతని బాధచూచి అనంగుడు సాక్షాత్కరించి అభీష్టమడిగినాడు. శ్రీనాథుడాతని సామ్రాజ్యమహిమను స్తుతించి

'హరిహరాదుల కంటె నతిసనాతనుడ వీ
వఖిలజీవుల కంతరాత్మవీవు
శంకరాదులయున్కి శంకించువా రుంద్రు
తెలియ నజాతనాస్తికుడ వీవు
అజుడగ్రజుండైన నగుగాక తత్కర్మ
కాండ నాదేశించు ఘనుడ వీవు
అలవేల్పు లందఱివలెగాక యడుగక
వచ్చి వరాలిచ్చువాడ వీవు'

అని మన్మథుని ఘనతను తెల్పినాడు.

అంతేకాదు. "నేనూర్వశిపొందుబాసి తన యూసును గోల్పడి యుంట స్వామి తా నోర్వడు, నాకుదక్క డిక నూర్వశి గూర్పవ యేని చెచ్చెరన్" (49ప) అని శ్రీనాథుడనుటలో ఈశ్వరార్చన కళాశీలుడగు నాతడామె పొందులో కామియై మోక్షగామి యగుచున్నట్లు కనబడుచున్నది.

దానికి సైదోడుగా కవిచెప్పిన

'చిత్తము నీకుఁబుట్టినిలు
శీతమయూఖశిఖావిటంక సం
పత్తికి మెట్టినిల్లు మఱి
భావన నీయది భక్తి వానిదై
జొత్తిలు నాకవిత్వమునఁ
జోద్యముగాఁ గథలేతదీయముల్,
చిత్తమునం జిగిర్చినవి
జీవకళల్ రసముల్ త్వదీయముల్.(15)

అనుపద్యములో శ్రీనాథుని కవితారహస్య మున్నది.

అందమొక్క తన శరీరముననే యుండుట కిచ్చగింపక మన్మథుడు శరీరమును వీడి తన అందము ప్రపంచమున కంతకును పంచి పుణ్యము గట్టుకొన్నాడట! భావములో ఊర్వశి అభావమగుటచే తన చిత్తములో శివుడు వెరెత్తినాడని శ్రీనాథుడు సర్వాత్మకుడయిన మన్మథుని వేడగా వేరుపాయము లేక శ్రీనాథుని, శివుని ఒకే మారు తనియింపజేయుటకు తానే ఊర్వశీ రూపము నెత్తెను ... కవి ఆరూపములో శంకరుని సాక్షాత్కారమైనట్లు సంతసించెను. దానితో లోకమున సృష్టికాండ స్తంభించెను. అప్పుడు ఇంద్రుడు ధూర్జటిని వేడికొని ఊర్వశిని పంపించెను. ఊర్వశు లిద్దఱను జూచి ఆశ్చర్యపడి శ్రీనాథుడు కోపగించెను. ఆ క్రోధాగ్నికి చిత్తజుడు భస్మముకాగా శివుడాతని బ్రదికించి చిరంజీవునిగా జేసెను. దానికి మన్మథుడు శ్రీనాథుని అభినందింప జూచెను కాని సుకవి కానరాలేదు, దానికిఁ చిఱునవ్వు నవ్వె శివుడు' అనుటలో శ్రీనాథుడు శివైక్యమందెననియు, ఆతనిమూలముననే ఆంధ్ర సాహిత్య లోకమున మన్మథుడు చిరంజీవియై శృంగారరసము నిలిపెననియు కవిభావన.

రంభాకల్పము :- తెలుంగు రాయడు కస్తురిని పంపి కబురుచేయగా రంభ వచ్చినది రాయ లామె నాహ్వానించుచు.

'నీసాంగత్య సమిద్ధకావ్యమునఁ బుం
డ్రేక్షుప్రభుశ్లాఘనై
నీశృంగార విపంచికం బొడముతం
త్రీస్వాదు నాదంబనై
నీసౌందర్య మహస్సులో నణువునై
నే లీనమై పోదురా
కాసారంగధరోపమానస! అదే
కైవల్య మిజీవికిన్" (7 ప)

అని అనుటలో అతని సౌందర్యోపాసన సువిదితము.

తరువాత నాతడామె 'శృంగారమహార్ణవమ్మున జలాంతర్గామి' యైనాడట! ఆమె రూప విశేషమును కవి 'లలనాంగకముల కెన్ని యుపమలున్నఁ బూర్ణాకృతికుపమ లేదు. నిల్వుటద్దము లోపలికీడ దక్క' అని స్తుతించినాడు. (10 ప)

రంభారాయ లానందవారధిలో నోలలాడిరి. దానికి కారణము వారు స్మరవేద ఘనపాఠివరులె కారు. స్వానుభవ మహాభాష్య సంధానచణు' లట!

నారదముని కస్తూరి గుబాళింపునకు ముగ్ధుడై వచ్చి కస్తూరిని వేడగా "బ్రహ్మచారులకు కస్తూరి ఎందులకు?" అని రాయలనెను. ఈమధ్య శ్రీనాథుసఖ్యమునను కామచారులై పాట విడనాడి కవితలో బడినారు" అని రంభ అనును. తెలుగు సాహిత్యమున శ్రీనాథుడా సిరికినాథుడైనవాడేగాని అన్యుడు కాడనియు; అతని కవిత్వము బ్రహ్మచారునికూడ కామచారునిగ నొనర్పగలదనియు కవిసమర్థన. అంతియే కాదు. మారనారదుల కిద్దరకు ఒకే పోలిక కలదట! వారి కలుములు జగత్కారణములే నట! ఆ గడుసుమాటలకు సహించి నారదుడామె ఇచ్చిన కస్తూరిని గ్రహించి ఆశీస్సులందించి వెడలినాడు.

ఒకనాడు నలకూబరుడు వచ్చి రంభను తీసికొని పోయెను. నారదుడు వచ్చి రాయలను ఓదార్చి ఇంద్రునకు, ఫిర్యాదు చేయుమని చెప్పెను. రాజుకోరికపై శచీపతి 'జారధర్మాసనము'ను దీర్చెను. కవిసార్వభౌముడు రాజుపక్షమున న్యాయవాదియై "సర్వజనప్రవేశార్హమై తగునట్టి వలరాజవేల్పు దేవళమురంభ, ఆమె నలకూబరుని గుత్తయగుట యేమి-" అని వాదించెను. "కనీసము రసాభాసమానమైన కవితచెప్పినా" అని అనుటలో కవీశ్వరుడు స్వర్గ సుఖార్హుడను కవిభావన విస్పష్టము. దానిలోఁ ఒక్కపూటను మరుని పస్తుండనిని రంభ కాలుమాసాల స్మరోపవాస శిక్ష'ను ఇంద్రుడు విధించెను. శ్రీనాథుడది దారుణమనెను. అప్పుడు శక్రుడు" రంభలోగిట బనల్లన్ దెల్గురాయండు, రేలనుఁ గౌబేరియుఁ బంచుకొందు'రనగా; తెల్గురాయని 'పగటివేషములకు పట్టపగ్గములు' లేకపోగా, నలకూబరునకు 'నక్తదివాంధవృత్తి' ఏర్పడెను. 'రంభకల్ప మారంభ మయ్యెను. 'రంభగూడె తెలుంగురాయరాహుత్తుండు' అను చాటువాధారముగా గొని కవిచేసిన అపూర్వకల్పన ఇది.

రమణీప్రియ దూతిక:- స్వర్గలోకమున ఊయలూగు పెద్దనను చేరి హారిణి చేయి పైని వైచినది. 'శ్రీహరీ' అని తిరస్కరించి నాడాతడు. దాని కామె "మా వరూథినికి గీడొనరించిన ప్రౌఢకెట్లు మాతావునఁ దావు గల్గె"నని ప్రశ్నించి "భవత్ప్రవీణతల్, పూతమెఱుంగు లైతలయి పోయెగదా పరిభూతభావజా" అని గేలిచేసి వెడలిపోయినది. ఇక్కడనే, పరిణత మన్మనః ప్రభవ పాత్ర సుమాప్రవరుండు" అని పెద్దన పలుకుట, "వీరిరువురభిన్నులామను చరిత్రము మానసపుత్రి వీరి" కని హారిణి చెప్పుటలో కవి ఏపాత్ర సృష్టించినను ఆతని మనోభావననుబట్టి సృజించు నని స్పష్ట మగును.

హారిణివెళ్లినవెంటనే పెద్దన మనసు ఊయలలూగెను. హారిణీదూతిక దెచ్చిన కప్పురవిడెమును వైచికొని తనకోరికనామెకు తెలిపెను. పోయినదానికి వగవక కోరివచ్చిన తన్ను స్వీకరింపుమని అది వేడగా, దాని కాత డంగీకరింపక" కప్పురవిడె మాత్మ కింపయిన భోజనమిచ్చిననే గదా" అనెను. అప్పుడామె చింతించి వెడలినట్లే వెడలి తనవిద్యవలన హరిణీరూపమున వచ్చి కౌగలించెను. 'ఆ పంచాస్త్రాగమ పండితాగ్రణి రసబ్రహ్మం బుపాసింపగా, ఆతడచ్చెరువుగ సంతరించిన ప్రసిద్ధరసాశురతి ప్రబంధమం. దతిమిన నవ్య దివ్యమణిత ధ్వనులే' మత్తకోకిల లైనవి. ఇదికూడ పెద్దన చెప్పె నను చాటువాధారముగ చేసిన కల్పన.

దక్షిణ నాయిక:- ఇంద్రుని కొలువులో మేనక, తిమ్మన, నారదుడు ఉండగా మేనకాదులు తిమ్మన పాటను మెచ్చుకొనిరి. నారదునకు కోపము వచ్చెను. తిమ్మన కొన్ని పారిజాతములాతని కిచ్చి సత్కరించెను. కాని నారదుడు వాటి సౌరభమెంతదూరము పోవునో చూతమనుచు వెడలిపోయి విశ్వామిత్రునిఁ జేరి "మేనలేని మేనున నుమలేని శంభునిగ నున్న మిమ్ముం గనుగొంచుఁ గుందెదన్" అని తిమ్మన తనకవితా పతః ఫలముచే మేనకను పొంది విగ్రవీగుచున్నాడని ఫిర్యాదు చేసెను. దానికి విశ్వామిత్రుడు మండిపడి తిమ్మనకడకేగి వారిద్దఱను శపింపనెంచెను. అదిచూచి తిమ్మన తాను పరాయివాడు' కాడనియు, ఆతని గోత్రము వాడగుటచే తనే ఆరసజ్ఞత తన కబ్బెననియు, విశ్వామిత్రుని గా పేర్గన్న ఆతడు మనుమడగు తనకు మేనక నిచ్చి విశ్వామిత్రుడుగా మారుట మంచిదనియు, మేనక తనవద్దనున్నను నెదలో విశ్వామిత్రునే తలంచుచున్నదిగాన ఆమె కంటికి తాను కూడ విశ్వామిత్రునివలె కనబడునట్లు వర మీయవలెననియు వేడెను. దాని కాతడు సంతసించి ఆమె దక్షిణ నాయికగా కాక తిమ్మననే నమ్మియుండునని చెప్పి వెడలి

(తరువాయి 7 వ పేజీలో)

# పురుషార్థ సుధానిధి

### ధర్మస్కంధము – అతిథి సత్కార కథనము

మూలము : శ్రీ సాయణాచార్యులు.

పూర్వము ఏకర్మచే గృహస్థునిచేత మృత్యువు జయింపఁబడినది? సూతమహర్షీ! అది యంతయుఁ జక్కగా వివరింపుమని మహర్షులడుగఁగా సూతుఁడిట్లనెను.

గృహస్థున కతిథిపూజను మించినపరమ ధర్మములేదు. ఆధర్మముచే మృత్యువు జయింపఁబడు ననుటలో సందేహములేదు. దానికి ప్రాచీనమైన యితిహాస ముదాహరణము.

మాహిష్మతియను నగరమున నీతి విశ్రుతుఁడైన ద్యుతిమంతుఁడను రాజుండెను. ఆతనికుమారుఁడు దుర్యోధనుఁడు యుద్ధమున దుర్జయుఁడు. ఆతని రాజ్యమున దీనుఁ డొకఁడునులేఁడు. దుర్గతినొందినవాఁడును లేఁడు. ఆతఁడు దయావంతుఁడు. మధురభాషి. అసూయారహితుఁడు. జితేంద్రియుఁడు. ధర్మాచారము గలవాఁడు. అనృశంసుఁడు. పరాక్రమవంతుఁడు. ఆత్మస్తుతిలేని వాఁడు. యాగకర్త. దాత. మేధావి. బ్రాహ్మణహితుఁడు. సత్యప్రతిజ్ఞ గలవాఁడు.

పుణ్యశీతల జలయు, మంగళప్రదయు, దేవనదియునగు నర్మద సువ్రతుఁడు పురుషశ్రేష్ఠుఁడునైన యాదుర్యోధనుని వరించెను. నర్మదయందాతనికి రూపముచే సుదర్శనయు, రాజీవలోచనయు నగు సుదర్శనయను పుత్త్రిక జన్మించెను. స్త్రీలలో నంతటిసౌందర్యవతి యెన్నఁడు జనించి యుండలేదు.

రాజకన్యయగు నాసుదర్శన నగ్ని యభిలషించెను. పితృసందేశమున నియుక్తయై శుశ్రూషార్థ మాసుదర్శనమహారాజు నగ్నిగృహమున నుండఁగాఁజూచి యగ్ని యామె సౌందర్యముఁ గనుఁగొని మదన బాధనొంది పత్నిగాఁ బడయఁ గోరి "సుందరీ! కామదృష్టితో నన్ను భజింపుము." అనెను. మహాత్ముఁడయిన హుతాశనునిచే నీవిధమున నభిలషింపఁబడి యామె కొంచెము గుండెచెదరితి బాధతో నిట్లనెను.

"ఓయీ! కులీనలయిన కన్యలకు మాతాపితలు బాంధవులు ప్రదానముచేయ నధికారులు. అగ్నియందు పాణిగ్రహణ మంత్రములతో హోమమొనరించి సత్పురుషులమధ్య నొసఁగఁబడిన పతియే యామెకు రక్షకుఁడు. అట్టి కన్యనైన నే నస్వతంత్రను. కావున నాతండ్రి నడుగుము."

యజ్ఞము జరుగుచున్న సమయమున బ్రాహ్మణస్వరూపమున నగ్ని ఆకన్యను యాచించెను. రాజా కన్య నాతనికీయఁ దలఁపలేదు. 'ఈతఁడు దరిద్రుఁడు, సవర్ణుఁడు కానివాఁడు' నని రాజు భావించెను.

యజ్ఞదీక్షితుఁడై యారాజు హవనార్థ మగ్ని నాహ్వానింపఁగా నాతఁడు రాన రాఁడయ్యెను. దాని కారాజు భయపడి వ్యథచెంది ఇది మానవుల కెపుడు జరగని సంఘటన యని విచారపరుఁడయ్యెను.

ఋగ్యజుస్సామవేదపారగులును, వేదార్థతత్త్వవిదులును, నగు బ్రాహ్మణులనేకవిధముల పావకుని స్తుతింపఁగా నాతఁడు స్వరూపమును బ్రకాశింపఁజేసి వారితో నిట్లనెను.

"దుర్యోధన పుత్త్రికను నేను వరించితిని. ఆరాజు నిరాకరించుటచే అదృశ్యుడనైతిని." అగ్నిమాటలు విని విస్మితులై యాబ్రాహ్మణులు ప్రాతఃకాలమునఁ బోయి రాజున కాసంగతి నివేదించిరి. రాజది విని సంతసించి దాని కంగీకరించెను. అగ్ని నిత్యము సన్నిహితుఁడై యుండుట నాతఁడు శుల్కముగాఁ గోరి పుత్రిక నాతనికి సమర్పించెను. ఆయగ్ని యజ్ఞమున సుధారసమునువలె నామెను గ్రహించెను. ఆమె యందాతనికి సుదర్శనుఁడను పుత్త్రుఁడుగలిగెను. ఆశిశువు వేదము లన్నిటిని గ్రహించి యుండెను.

ఓఘవంతుఁడను రాజువిద్వాంసుఁడైన సుదర్శనున కోఘవతి యను తన పుత్త్రికను భార్యగా నొసఁగెను. ఓఘవతితోఁ గూడి యాతఁడు కురుక్షేత్రమున నివసించుచు "గృహస్థుఁడనై యుండుచు మృత్యువును జయింపవలయు" నని తలపోసెను. దీప్తతేజుఁడు మహామునియునైన యాసుదర్శనుఁ డట్లు ప్రతిజ్ఞచేసి, భార్య కిట్లనెను.

"నీ వెన్నఁడు నతిథికిఁ బ్రతికూలము సేయరాదు. నిత్యము నతిథికిఁ బ్రియము సమకూర్పవలయును. ఏవిధమయిన సందేహమునులేక ఆత్మప్రదానము చేతనైన నాతని సంతసింపఁ జేయవలయును. ఈవ్రత మెల్లపుడు నా హృదయమును బాయక యుండును. గృహస్థున కతిథిని మించిన పరమార్థములేదు. నామాట నీకుఁ బ్రమాణమైనచో నే నున్నను లేకున్నను అతిథి నగౌరవపఱచరాదు."

ఓఘవతి కరములు శిరమున జోడించి యాతఁడు తెలిపిన నియమమును బ్రతిగ్రహించెను. అవకాశము కొఱకు నిరీక్షించుచు మృత్యువు సుదర్శను ననుసరించుచుండెను. సుదర్శను డిధ్మములకొఱకుఁ బోయినపుడు ధర్ముఁడు బ్రాహ్మణవేషమున నతిథియై యోఘవతి కడకుఁబోయి యాతిథ్యముఁ గోరెను. విధివిధానమున నామె యాతనికర్ఘ్యపాద్యాదులొసఁగి పూజించి నీకేమి యొసఁగుదు ననియడిగెను. "గృహస్థాశ్రమ సమ్మతమయిన ధర్మమునందు నీకాస్థ యున్నచో ఆత్మప్రదాన మున నాకు సంతుష్టి కల్గింపు" మని యాతఁడు కోరెను. ఇంకితరములు వేనివలనను నాకుఁ బ్రియము కలుగ దనెను.

రాజకుమారియగు నోఘవతికి భర్తృ వచనము జ్ఞప్తికి వచ్చెను. కొంచెము బిడియముతో నాయతిథి కోరిక కంగీకారముం దెలిపెను. ఆ బ్రాహ్మణుండా మెతో రహస్య కుటీర ప్రదేశమునం బ్రవేశించెను. ఇంతలో నిధ్మముం దీసికొని యగ్ని పుత్త్రుం డచటికి వచ్చెను. ఎచట నుంటివి వని యోఘవతి నెన్నో సారులు పిలిచెను. అతని కామె ప్రత్యుత్తరము లేదు. రహస్య కుటీర ప్రదేశముననున్న బ్రాహ్మణుండు "నేను బ్రాహ్మణుండను. అతిథిని. నీ భార్య ఆత్మ దానమున నాకు సమర్చన గావించు చున్నది. ఇపుడేమి కర్తవ్యమో నీవు తెలుపుము." అని సమాధాన మొసంగెను. కూటముద్గర హస్తుండై మృత్యువు భగ్న ప్రతిజ్ఞుం డయినచో నా రాజును జంప వలయునని భావించుచుండెను.

అగ్ని పుత్త్రుండయిన సుదర్శనుడు మనో వాక్కర్మల చేత నీర్ష్యా రహితుండై నవ్వుచు నిట్లనెను. "సంప్రాప్తించిన యతిథిని పూజించుట గృహస్థునకుం బ్రధాన ధర్మము. అతిథిపూజితుండై వెడలుటకంటె ఉత్కృష్టధర్మము లేదని బ్రహ్మ ప్రజాపతి యింద్రుండు అగ్ని వసువులు యముడు మున్నగు మనీషులు పలుకుదురు. వీరతిథిని పూజించి భుజింతురు. బుద్ధి, ఆత్మ, మనస్సు, కాలము, దశదిశలు పృథివ్యాది పంచభూతములు, ప్రాణుల పుణ్యాపాపములను నిత్యము వీక్షించు చుండును. నా ప్రతిజ్ఞను పాలించి దేవతలు పాపహరణము గావింతురు గాక. నా ప్రాణములు, భార్యలు ఇతర ధనములు అతిథి సమర్పణము గావించుట నా వ్రతము."

'అది సత్యము' అని అన్ని వైపుల నాద ముద్భవిల్లెను. కుటీరమునుండి బ్రాహ్మణుండు వెలువడి భూమ్యాకాశములను వాయువునను వ్యాపించి సుదర్శనుని సంబోధించి యిట్లనెను.

"నేను ధర్ముడను. నీకు శుభమగుంగాక. నీ వ్రతమును బరీక్షించుటకై వచ్చితిని. నీ సత్త్వముం జూడ నీమీద నధికమైన ప్రీతి గలిగినది. మృత్యువు నీచే జయింపంబడినది. రంధ్రాన్వేషియై నిన్ను సరించి యున్నది. నీచే వశీకరింపంబడినది. ఈ యోఘవతి యే ప్రాణికిం జెనకరాని మహాపతివ్రతగా గ్రహింపుము.

అన్యాలోచన తగదు. ఈమె వలన నీవు తపస్సాధ్యము లయిన లోకములు సిద్ధించినవి. ఈ దేహముతోడనే నీవు ఉత్తమ లోకములను దర్శింపంగలవు. నీచే మృత్యువు జయింపంబడినది. ఐశ్వర్యము ప్రాప్తమైనది. నీ యీ గృహస్థ ధర్మముచే లోకములు, పంచభూతములను జయింపంబడినవి." ఇట్లు పలికి పూజ్యుండైన ధర్ముం డదృశ్యుండయ్యెను.

సుదర్శనుండు దురాసదమైన మృత్యువును గృహస్థధర్మముచే జయించి సపుత్త్ర పశుబాంధవముగా సశరీర స్వర్గము నొందెను. కావున గృహస్థున కతిథిని మించిన వేఱు దైవము లేదు. ఇది సత్యము. అతిథి పూజ వలనం గలిగిన శుభము నూఱు యజ్ఞముల వలన నైన లభింపదు.

అజ్ఞాతకుల నామములు గలవాడైనను బుభుక్షతో తత్కాలమున నేతెంచి నట్టియు, శాంతుడైనట్టియు, యాచించు నట్టియు, దరిద్రుడైనట్టియు, బ్రాహ్మణుని అతిథి యందురు. ఆతని యథాశక్తి పూజింపం దగునని విబుధులందురు. గోత్రాదికమును, స్వాధ్యాయమును, తపసును, శాస్త్రాదికమును, ఆకారానాకారములను గణింపక యాతని బ్రహ్మగా భావింప వలయును. (పాత్రుడైన) యతిథి వచ్చినపుడు వెంటనే పూజింపనివాడు చక్కగా చేసిన హోమమును నిష్ప్రయోజన మగును. కావున బ్రాహ్మణుల కతిథి నిత్యము పూజనీయుడు. (ఆగ్నేయ పురాణము)

( 5 వ పేజీ తరువాయి )

పోయెను. అప్పుడు మేనకా తిమ్మనలు సౌఖ్యమున నోలలాడిరి.

తిమ్మన కౌశికగోత్రజుం డను దానిపై కవి చేసిన ఊహ ఇది.

మోక్షగామి :- ధూర్జటిమహాకవి శివుని మీదభక్తితో, స్త్రీలమీదిభక్తితో స్వర్గమునకు చేరినాడు. కాని అతని దరిజేరుటకు వేశ్యలు భయపడిరి. దానికై వగచి దివమంతా మిథ్యయని తలంచి, కైతలో సుకుమారవారవనితా జనమధురాధరామృతము గ్రోలిన వానికి దివిలోకూడా కైతమాధురి ఫలమీయదా అని యోచించి సమస్త దివిషద్గణికా మానవశీకరణార్మకమా' ఒక వ్రతముం జేయ సంకల్పించెను. దానితో అనురాధిపుని ఆజ్ఞతో రోజుకొక్క వేశ్య ఆతని యింటికి రా దొడగెను. ధూర్జటి రంభాద్యప్సరలతో కూడి కూచిమారాదులు రచించిన స్మరసూత్రములకు స్వానుభవ మహాభాష్యము వ్రాసెను. అంతేకాదు. 'అప్సరశ్శత కోపగూహనము బడుల నతడు నేర్చిన మన్మథాంకిత రతి ప్రబంధము లవి బ్రహ్మానంద బంధురోపమాయత పరమానంద సంధాయకములు'గా నొప్పెను. 'రాత్రు లెల్ల శివరాత్రులు కాగా అప్సరసలెల్ల శివమెత్తి ఆక్రమింపగా ధూర్జటి బ్రదుకు 'అర్ధనారీశ్వర' మయ్యెను.

అతని కామమున నొవర్చిన ఈశ్వరార్చనను గూర్చి కవి

'కాంతాశ్లేషము పానవట్టమధిపే
కంబుల్ ప్రమోదా శ్రువుల్
దంతాళి ప్రథలిద్ధ దీపములు ను
ద్యద్ధూపము శ్వాసమే
కాంతాలాపము స్తోత్ర పాఠము నమ
స్కారంబు నైవేద్యమున్,

—...—

ంతుక్రీడగ సత్కవీంద్ర శివలిం
గంబొప్పె నప్పట్టునన్ (16 ప)

అని చెప్పుటలో ధూర్జటి శైవతత్త్వము స్పష్టమగును.

దానితో నలకూబరాదులు మంచము పట్టినారట! కుబేరుడు కుమారుని వ్యథకు బాధపడి శివుని వేడగా నాతడు చెప్పిన యుపాయముతో ఇంద్రుడు అప్సరసల నందఱను శివరాత్రికి కైలాసమున కేగ నాజ్ఞాపించెను. వారితోబాటు ధూర్జటి కూడ 'పూసల దారమట్లు' తారాద్రి కేగెను. శివు డాతని కరుణించి "నీశివ భక్తి కావ్యసరణిం గడు ధన్యత బొందె నింక నాలో శయనింపు శాశ్వత విలీనవికల్పసమాధి" ననగా ధూర్జటి.

'స్వామి! మోక్ష మనగ నేమి?నీలోన నా
యంతవా డూరక యైక్యమగుట
పోనిమ్ము లీనమైపోదునా యన్న నా
వలె మతినినుఁ గొల్చువా డెవండు?...
ఈవులేక నేనుండలే నేనులేక
యెట్లులుందువు నీవు నా చిట్టితండ్రి !
(23 ప)

'అమరస్త్రీల రమించినం జెడదు మో
హంబంచు నా బ్రహ్మ ప
ట్టము సిద్ధించిన నాసదీఱదనిరూ
ఢంబయ్యెనా, కింక నీ
దుమదిం జొచ్చెద నన్న భావభవుడం
దున్ లేడె? నాకింక నె
య్యది గమ్యం బనియేడ్చు ధూర్జటికి బ్ర
హ్మానంద మీశుం డిడెన్ (24)

'కామిగాక మోక్షగామి కాడు' అను సూక్తిని నిరూపించు కథ ఇది.

( సశేషం )

—...—

# తెలుగు నాటి వ్యావహారిక భాష

— శ్రీ ఎల్. కె. మల్లేశ్వరరావు, ఎం. ఏ.

మానవుడి భావవ్యక్తీకరణ సాధనాల్లో అత్యంత ప్రధానమైనది భాష. శక్తిమంతంగానూ ఔచిత్యసుందరంగానూ భావాన్నివ్యక్తీకరించడమే భాష యొక్క ప్రయోజనం. ఇది పారంపరీణం. పరిణామం దీనిస్వభావం. కాబట్టి నిత్యవ్యవహారోపయుక్తమైన ఏ భాష అయినా దేశకాల పాత్రలను బట్టి మార్పులు పొందుతూనే ఉంటుంది.

నన్నయ నాటినుంచి చిన్నయ నాటి వరకూ తెలుగు సాహిత్యోపయుక్తభాష గ్రాంథికమని పండితుల భావన. శిష్టవ్యవహారంలో అందులోనూ కేవలం వాగ్వ్యవహారంలో మాత్రమే ఉన్న భాషాభేదాన్ని మనపూర్వులు 'వ్యావహారికం' అని అన్నారు. వాగ్రూపంలో శిష్ట వ్యవహారంలో ఉన్నా అది శిష్టుల రచనల్లో స్థానంసంపాదించుకోలేకపోయింది.

తెలుగుభాష అస్తిత్వాన్ని నిరూపించే లిఖితాధారాలు క్రీ. పూ. 200 సం॥ నుంచి లభిస్తున్నాయి. క్రీ. శ. 575 నుంచి తెలుగు వాక్యాలతో ఉన్న శాసనాలు లభిస్తున్నాయి. తొలి తెలుగు కావ్యమని చెప్పబడుతున్న ఆంధ్ర మహాభారతం యథామాతృకంగా లభ్యంకాకపోవటం వల్ల, ప్రాచీన భాషాస్వరూపాన్ని యథాతథంగా తెలుసుకోడానికి పరిణామం అసాధ్యమైన తామ్ర శిలాశాసన భాషే ఏకైకాధారం.

ప్రాచీనశాసనాల్ని పరిశీలించినప్పుడు వ్యావహారిక భాష ఎప్పుడు నియమబద్ధంగానే ఉండేదనీ, ఈనాటి శిష్టవ్యవహారానికీ శాసన భాషకు క్రమపరిణామరూపకమైన చారిత్రాత్మక సంబంధం ఉందనీ అవగత మౌతుంది.

నన్నయ కావ్యభాషతో ఆనాటి శాసన భాషను పోల్చిచూస్తే అప్పటికే అవి భిన్నంగా ఉన్నాయని తెలుస్తుంది. నన్నయ యుగం నుంచి ఆధునిక యుగారంభం వరకూ తెలుగు సాహిత్యంలో దాదాపు అన్నీ పద్యకావ్యాలే కాబట్టి వాటిలో పాత ఒరవడి కనిపిస్తుంది. అయినప్పటికీ అక్కడక్కడ కవిస్వేచ్ఛాపరతవల్లనో, సమకాలిక వ్యవహారప్రభావంవల్లనో, ఛందో నిర్బంధాలవల్ల పేరుమోసిన కవులరచనల్లో కూడా కావ్యభాషాసంప్రదాయానికి భిన్నమైన రూపాలు కనిపిస్తాయి. వ్యాకర్తలు వాటిలో కొన్నిటిని అనింద్యగ్రామ్యాలనీ,పూర్వకవుల ప్రయోగాలనీ మన్నిస్తూ వచ్చారు. కాని వివిధశాస్త్ర గ్రంథ వ్యాఖ్యల్లోనూ, ఇతర రచనల్లోనూ కూడా మహాపండితులు సైతం వ్యావహారిక భాషను ఆదరిస్తూ వచ్చారు.

తిక్కన 'ప్రాతవడ్డ మాటల్ని పరిహరింపా లనటాన్ని బట్టి అప్పటి విద్వత్కవులు పూర్వకాల శబ్దోపయోగాన్ని అభిమానించేవారు కాదని చెప్పవచ్చు. 'ఇచ్చినాఁడు' వంటి క్రియారూపాలు నన్నయ భాషలోలేవు. తిక్కనభాషలో 'ఇచ్చినవాఁడు' తోపాటు ఇచ్చినాడు కూడా ప్రయుక్తమైంది.

గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదంలో పదజాలంకూడా ప్రముఖస్థానం ఆక్రమిస్తుంది. అందులోనూ మిశ్ర సమాసాలు మరిముఖ్యం. తెలుగులో ప్రవేశించిన సంస్కృత ప్రాకృత పదాలు తత్సమాలు. తద్భవాలు అన్యదేశ్యాలే అయినా వాటిని గురించి అత్యంత గౌరవంగా వివరించిన మనవ్యాకరణాలు తదితర అన్యదేశ్యాల విషయంలో మౌనం

వహించాయి. ఇవి సంప్రదాయ వ్యాకరణాలకు విరుద్ధాలే అయినా ప్రవాహినిగా ఉండే భాషా స్వభావాన్ని సుబోధకం చేసేవి ఇవే. తిక్కన కవితలో ఒకటి రెండు అన్యదేశ్యాలు మాత్రమే కనిస్తాయి. సంస్కృత ప్రాకృతేతర అన్యదేశ్యాలకు సాహితీగౌరవ మిచ్చిన తొలి తెలుగు కవి మహాకవి తిక్కనే.

శ్రీనాథ యుగం నుంచీ అన్యదేశ్యాలు మనకావ్యాల్లో ఎక్కువ కనిపిస్తాయి. సంఘజీవి అయిన కవిని రాజకీయ కారణాల వచ్చిన మహమ్మదీయ భాషా ప్రభావం ఆకర్షించింది. మహమ్మదీయుల రాజకీయశక్తితో పాటు వాళ్ళ భాషా పదాల సంఖ్య బలంకూడా తెలుగులో పెరిగింది. ఆశ్రయ దాతల అన్య భాషా పాండితిచేత ఆకర్షితుడైన శ్రీనాథుడు అన్యదేశ్యాలను స్వేచ్ఛగా వినియోగించాడు. ఇతని కాలంనుంచే వ్యావహారికరూపాలు పద్యగ్రంథాల్లో చాటువుల్లో దొరుకుతున్నాయి. దేశం చూసినవాడు కాబట్టి కొత్తదారులు తొక్కినా సామాన్యలాక్షణికులూ కవులూ వేలెత్తి చూపడానికి సాహసించలేని వ్యక్తి కాబట్టి అతడే నిరంకుశతకు చిహ్నంగా అసాధురూపాల జీవశక్తిని కవితలో వినియోగించుకో గలిగాడు.

తర్వాతి కాలంలో అప్పకవిలాంటి ఛాందస లాక్షణికులు కూడా 'వ్యవహారహాని' భయంవల్ల మ్లేచ్ఛోక్తులను అంగీకరించి అవి వాడిన కవుల కావ్యాలకు ప్రామాణికతాప్రదానం చేశారు. అన్యదేశ్యాలు వాడటంవల్ల భాషా సాంకర్యం జరుగుతుందనుకోవటం పొరపాటు. భాషలో నూతన పదజాలంచేరడం దాని వికాసానికి నిరూపణం.

పద్యకావ్యాల్లో వ్యావహారిక రూపాల సంఖ్య తక్కువగా ఉన్నా గేయపద కవితల్లో ఎక్కువగా ఉన్నాయి. క్రీ.శ. 1300 నాటి తాళ్ళపాక కృష్ణమాచార్యుడు 'సంకీర్తనలక్షణ' మనే తన గ్రంథంలో వ్యవహృతరూపాల చెల్లుబడిని అంగీకరించాడు. ఫలితంగా తాళ్ళపాక అన్నమాచార్యుల కాలానికి వ్యాప్తిలోకి వచ్చిన కీర్తన సాహిత్యంతో వ్యావహారికం క్రమంగా వేళ్ళూనటం ప్రారంభించింది. అన్నమయ్య, త్యాగయ్య, క్షేత్రయ్య కీర్తనల్లోనూ, పదహారో శతాబ్దంలో ఆరంభమైన యక్షగాన వాఙ్మయంలోనూ వ్యావహారిక రూపాలు అసంఖ్యాకంగా ప్రవేశించాయి. ఇక ఆధునిక కాలంలో వస్తున్న గేయ సాహిత్య విషయం చెప్పనే అక్కరలేదు.

మొదటినుంచీ కావ్య, వ్యవహార భాషాభేదం అంతో ఇంతో ఉండగా అది రానురాను బలపడుతూ "మహమ్మదీయుల ప్రభావంతో" మధ్యయుగాల నుంచీ మనకవిపండితుల దృక్పథాల్లో కొద్దిపాటి మార్పులు రావడం మొదలుపెట్టాయి. ఆంధ్రనాయక రాజుల కాలంలో ఈ మార్పులు బలపడి ముఖ్యంగా వచన వాఙ్మయంలో కావ్య వ్యావహారిక భాషాభేదం సన్నగిల్లుతూ వచ్చింది.

ఆంగ్లేయులు వలసరాజ్యాధిపతులుగా స్థిరపడేకొద్దీ సంఘ జీవితంలో రాజకీయ వ్యవస్థలో కనీవినీ ఎరగని మార్పులు వచ్చాయి. వాళ్ళమతప్రచార దృక్పథం తెలుగుకు ప్రాధాన్య మీయక తప్పలేదు. జైనులూ, బౌద్ధులూ పాళీప్రాకృతాలు చేపట్టినట్లు, వీరశైవ మతప్రచారానికి దేశీయమైన తెలుగును పాల్కురికి సోమనాథాదులు చేపట్టినట్లు క్రైస్తవ మత ప్రచారకులు తెలుగును చేపట్టారు. క్రీ.శ. 1720 నుంచి క్రైస్తవ వాఙ్మయం వ్యావహారిక భాషలో రావటం మొదలైంది. క్రైస్తవ మత ప్రచారకుల ప్రాబల్యంవల్ల తెనుగు పాఠ్యపుస్తకాలు ఒకప్పుడు శిష్ట వ్యావహారికంలో రాయటం జరిగింది. బైబిలు అనువాదాల్లోకి కూడా చాలా వ్యావహారికరూపాలు ప్రవేశించాయి. కాని ప్రాథమిక విద్యావిధానం పండితుల పాలబడటంవల్ల ఆ తరగతుల పాఠ్య పుస్తకాలు కావ్యభాషలో వెలువడేవి. ఈ కావ్యభాషను అర్థం చేసుకోవడం, రాయడం చాలా కష్టమనీ, బోధనా మార్గంగా అది పనికిరాదనీ ఆపండిత వర్గంకూడా సకాలంలో గుర్తించి భాష సులభగ్రాహ్యమయేందుకు వ్యాకరణ నియమాల్ని సడలించింది.

అప్పటి భారత ప్రభుత్వపు సర్వేయర్ జనరల్ గాఉన్న కర్నల్ కాలిన్ మెకంజీ "165-3-1821" కావలి వెంకట బొర్రయ్యగారు సేకరించిన కైఫీయతులు మనవాళ్ళకు చారిత్రక దృక్పథాన్ని ప్రసాదించటం ఆరంభించాయి. వీటన్నిటినీ మరల రచింపచేసి ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ తెలుగువారికి ప్రసాదించాడు. ఇవి ఆనాటి శిష్టవ్యవహారానికి ప్రతిబింబాలు. క్రీ.శ. 1802 ప్రభుత్వ ప్రకటనలు వ్యావహారికలోనే ఉండేవి.

అనేక ఇతర పుస్తకాలతో పాటు 1848 కి ముందు ప్రచురించబడిన పాఠ్య గ్రంథాలన్నీ వ్యావహారికంలోనే ఉండేవి. ఆ సంవత్సరమే ఉపయుక్త గ్రంథకరణ దేశభాషా సభకు పరవస్తు చిన్నయసూరిగారు అధ్యక్షులయ్యారు. ఆయన 1853 లో నీతిచంద్రికనూ 1855 లో బాలవ్యాకరణాన్ని రచించి రాజధానీ కళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకులైన తర్వాత పరిస్థితులు తల్లకిందులుగా మారిపోయాయి. పరంపరాగతంగా చూపినా, వ్యావహారిక రచనా సంప్రదాయం ముఖ్యంగా వచన వాఙ్మయంలో కనిపిస్తుండగా చిన్నయసూరి కారణంగా పూర్వగ్రంథాల్లో పరిష్కరణ సంస్కరణల పేరిట గ్రాంథీకరించి వికృతీకరించటం జరిగింది. ఇది మన పూర్వులకు మనమే చేసిన అపకారం.

సజీవమైన వ్యావహారిక భాషాప్రతిభను వ్యాకరణ శృంఖలాలు అరికట్టకూడ

# తల్లీ! నిన్ను దలంచి...

— భారతీప్రియ.

పోతన కవితా సరస్వతి పోతనచేసిన ఈ సరస్వతీ స్తుతిలో సాక్షాత్కరించు చున్నది.

తల్లీ నిన్నుదలంచి పుస్తకముచే
 తన్నూనితిన్ నీవు నా
యుల్లం బందున నిల్చి జృంభణముగా
 నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లన్ బల్కుము నాదు వాక్కునను సం
 ప్రీతిన్ జగన్మోహినీ
ఫుల్లాబ్జాక్షి సరస్వతీ భగవతీ
 పూర్ణేందు బింబాననా.

ఇందులో ఉక్తులు, సుశబ్దము, వాక్కు అను మూడుపదములు నిర్దిష్టమైన అర్థములలో వాడబడినవి. వాక్కు మనలో నుండి వెలువడునది. దానికి భౌతిక శరీరము వంటిది సుశబ్దము. దాని యొక్క అర్థములు, భావములు మొదలైనవి అంతరంగిక సంస్కారములు. (ఇవిఉక్తములు.) ఒక తల్లి శిశువును కన్నపుడు కొన్ని సంస్కారములు గల జీవుడు భౌతిక రూపము నెట్లు పొందునో అట్లే మనవాక్కు కూడ మనలోని అనేక సంస్కారముల మూలమున సమ్మేళనము చెంది శబ్దరూపము ధరించును.మనయందరిలో నున్న సరస్వతి కారణముగ మన నుండి వాక్కు సంతానముగా వెలువడు చున్నది. అటువంటి వాక్కు సుశబ్దరూపము దాల్చుటకు ఆ తల్లి సంస్కారమెంత గొప్పది కావలెనో! అట్లైనచో ఆ సుశబ్దము ఉచ్చరింపబడినపుడు అనేక విశేష మనోహర వ్యంగ్యార్థములు వెల్లడియగును. ఇట్లు అర్థములు చెప్పబడుటనే 'ఉక్తులు' అందురు. పోతన కవితా సరస్వతి అనగా వాక్కు సుశబ్దరూపము కలిగి మనోహరమైన అర్థములు వెల్లడింపవలెనని అతని ప్రార్థన. ఆ వాక్కు ఎట్లుండవలెనో సరస్వతీ స్తుతిలో పోతనయే తేటతెల్లము గావించినాడు. 'జగన్మోహినీ, ఫుల్లాబ్జాక్షి సరస్వతీ, భగవతీ, పూర్ణేందు బింబాననా' అను 5 విశేషణములతో వెల్లడి యగు వ్యంగ్యార్థములు పోతన వాక్ శక్తిని విశదీకరించును. లాక్షణికుల తృప్తికొరకు వీనిని వ్యంగ్యార్థము లనుటయే కాని సత్యమునకు వేదార్థము లనుటయే వివేకవంతము. వేదార్థ మనగా ఋషులు కవితావాక్కు నుచ్చరించుట అని అర్థము. ఇది కవి యెడల భక్తితాత్పర్యములు కలవానికి సూటిగా గోచరించును. పాండిత్యభారముతోవంగి చూచు వారికి వక్రముగా గోచరించును. అందువలన కొందరు పండితులు సూటిగా గాక వక్రోక్తులచే తెలియ వచ్చు విశేషార్థములను వ్యంగ్యార్థము లని పిలుతురు. సహజ పాండిత్యుడైన పోతనకవిత్వమును లక్షణవిరుద్ధ మనుకొనక చిత్తశుద్ధితో చదివినచో అనేక వేదార్థములు దర్శన మిచ్చును. అట్టివి ఒక కొన్ని ఇచ్చట పదిల పరుపబడుచున్నవి.

పైని చెప్పిన సరస్వతీ విశేషణముల సుశబ్దములచేత ఉక్తములైన వేదార్థములు ఇపుడు దర్శింతము.

1. జగన్మోహిని :- అనగా జగత్తునకు మోహము కలిగించునది. మోహ మనగా ఒక వస్తువును మఱియొక వస్తువుగా భ్రమింప జేయుట. ఈ జగత్తునకు అట్టి మోహనశక్తి కలదు. కావుననే దీనికి జగత్తు అని పేరు వచ్చినది. 'గచ్ఛతీతి జగత్' అనగా కదలుచున్నది. గనుక జగత్తు అని వ్యుత్పత్తి. ఈ జగత్తు పరిణామ శీలమై నిత్యము మార్పు చెందుచుండును. కాని మార్పులేని విధమున నిత్యసత్యముగా గోచరించు చుండును. అట్లే ఒక వ్యక్తి మాట్లాడు అనేక వర్ణములు, పదములు మారిపోవు చుండును. కాని ఆ మాటల సముదాయములో అతని సంస్కారము స్వభావము నిత్యముగా మనకు వెల్లడియగును. అట్లే కవివాక్కులో అనేకశబ్ద ప్రయోగము లున్నప్పటికిని వానియందలి మోహనశక్తిచేత పాఠకునకు కవినిర్దేశించిన రూపమే కన్నులకు కట్టును. కవి చిత్రకారుని వలె బొమ్మగీసి చూపడు. కాని మధురమైన శబ్దములు మన ముందుంచుచుండును. వాని యందలి మోహనశక్తి మనకు మనోహరరూపములను మూర్తి కట్టించి దర్శనము చేయించును. ఇది సరస్వతి యొక్క జగన్మోహినీ తత్త్వము. అనగా పోతన కవితా సరస్వతి యొక్క జగన్మోహినీ రూపమే. ఉదా:

మందార మకరంద మాధుర్యమున తేలు
 మధుపంబువోవునే మదనములకు

అను ప్రహ్లాదుడు

చేతులొగ్గి వసింప నీ చిన్ని పాపని
ప్రోసిపుచ్చగ చిత్త మొల్లదు సత్తమా

---

( 9 వ పేజీ తరువాయి )

దనీ. భాష నవనవోన్మేషం చెందాలనీ అంటూ క్రీ. శ. 1910 ప్రాంతంలో శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు శిష్ట ప్రయోగాలను ప్రామాణికాలుగా గుర్తించాలంటూ ఒక ఉద్యమం లేవదీశారు. తత్ఫలితంగా అనేక తర్క వితర్కాలు జరిగి 1914 లో మద్రాసు విశ్వవిద్యాలయం గ్రాంథిక భాషకి పట్టం కట్టింది. కాని దేశంలోని సాహిత్యమంతా సజీవభాషలోనే వెలువడ సాగింది. అనుకరణం హి శిష్టస్య సాధు భవతి అనే పతంజలి వాక్యం, శిష్టానా ముక్తి సూత్రాణా మభావే అనుశాసన కారిణ ఏవదండనీయా అనే దండిమాట, వ్యావహారిక వాదులకు ప్రధానాయుధాలుగా ఉండేవి. (సశేషం)

అను బలిచక్రవర్తి ఎట్లు కన్పించుచున్నారో చూడుడు.

2) ఫుల్లాబ్జాక్షీ :- అనగా వికసించిన పద్మముల వంటి కన్నులుకలది అని అర్థము. కన్ను మనకు వస్తురూపములను దర్శనము చేయించుచున్నది. అట్లే వాక్కు కూడ వస్తురూపములను సాక్షాత్కరింప జేయుట మనకు అనుభవములోనున్నదే. మనము వాడుకొను వస్తువులన్నియు కూరగాయలు పప్పులు రేడియో మొదలైనవియు మన స్నేహితులు రూపములును శబ్ద మాత్రముచేతనే మనకు స్ఫురించుచుండును. మరి కవి ప్రయోగించిన శబ్దము అంత మాత్రము కాక వికసించిన పద్మమువలెనుండి మనకు వర్ణింపబడు వస్తువును సుస్పష్టముగా గోచరింప జేయును. ఇందులో పోతన వాచ్యముగా చెప్పని మరియొక వేదార్థమిమిడి యున్నది. కన్నులు వికసించిన పద్మములవలె నున్నవి. అన్నపుడు చాలమంది పద్మములంత విశాలముగనో అందముగానో ఉన్నవని మాత్రమే భావింతురు. ఈమాత్రపుదానికి పద్మ సామ్యమక్కరలేదు. పద్మములు అనగా సూర్యకిరణములచేత వికాసముపొందు పుష్పములు. అట్లే మన కన్నులు సూర్యశక్తిచేత నిదురనుండి మేల్కాని వికాసము చెందును. గనుక వానితో పోలిక చెప్పబడును. కవితా వాక్కు సూర్య కిరణము వంటిది. కనుకనే వేదములందు 'గోవు' అని సూర్యకిరణము, వాక్కు కూడ చెప్పబడు చుండును. అట్టి వాక్శక్తిచేత సుశబ్దము విప్పారిన పద్మమువలె రూపొందును. అది మన కన్నువలె చెప్పదలచిన వస్తువు లేదా వ్యక్తి రూపమును చక్కగా సాక్షాత్కరింప జేయును. కనుక పోతన శబ్దములు సరస్వతి కన్నులవలె సర్వ సృష్టిని దర్శనము చేయించునవిగా నుండును. ఉదా:-

సౌవర్ణ కంకణ ఝణ ఝణ నినదంబు
శింజనీ రవముతో చెలిమి సేయ
తాటంక మణిగణ ధగధగ దీప్తులు
గండమండల రుచుల్ గప్పిగొనగ-
పరుఁ జూచున్ వరుచూచు నొంప
నలరింపన్ రోషరాగో దయా
విరత భ్రూకుటి మందహాసములతో...
రాకేందు బింబమై రవిబింబమై
యొప్పు నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై యలరు
పూబోణి చేలాంచలంబు...

అనుటలో వీరశృంగార సమ్మేళనాభిరామ అయిన సత్యభామ ఎట్లు దర్శనమిచ్చుచున్నదో చూడుడు.

3) సరస్వతి:- సరస్ + వతి = అనగా ప్రవాహము కలది అని అర్థము. మనలోనుండి వాక్కు ప్రవాహ రూపముగ వెలువడును. అదిపరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అను నాలుగు దశలలో వెలువడును. వైఖరీ వాక్కు మనము విను శబ్ద రూపమైనది. మధ్యమా వాక్కు హృదయములో భావరూపమున నుండునది. పరా, పశ్యంతీ అనునవి దానికి పూర్వము కారణ కార్య బిందురూపము లలో నుండునవి. ఇవి యోగదృష్టికి దర్శనమిచ్చుచున్నవి. కవిశ్రేష్ఠుడు యోగభ్రష్టుడు గనుక అతనికి పరాపశ్యంతీ వాక్కులు దర్శనమిచ్చును. యోగభ్రష్టుడనగా అపార్థము చేసుకొనరాదు. లోకము కొరకై దైవ సంకల్ప వశమున కొందరు యోగులు కవులుగా పుట్టుదురని గ్రహింపవలయును. అట్టివారే పోతన, త్యాగయ్య మున్నగువారు. యోగి అయిన కవి పరాపశ్యంతీవాక్కులను పరమాత్మయోగము నందు దర్శించి లోకమునకు వైఖరీ వాక్కుగా అందించును. ఈవిధముగ పరాపశ్యంతీ వాక్కుల దర్శనముతో మధ్యమా వైఖరీ వాక్కులు వెలువడుటయే సరస్వతీ లక్షణము. గంగావతరణము వంటి పోతన కవితలో ఈ లక్షణము ధారాశుద్ధిగా కనిపించును. దీని వలన కవి పరాపశ్యంతీవాక్కుగా దర్శించునది పఠిత చేతకూడ దర్శింప చేయగలుగును.

అల వైకుంఠపురంబులో నగరిలో
ఆమూల సౌధంబుదా
పలమందార వనాంతరామృతసరః
ప్రాంతేందు కాంతోపలో
త్పలపర్యంకరమా వినోదియగు
ఆపన్న ప్రసన్నుండు.

వ. బాలశారదా కుచ కుంభంబుల పగిదికగ్గలంబైన బుగ్గలును, బుగ్గల సంగడంబునం బారిజాతకుసుమస్తబకంబుల చెలువంబునుండెగడు వెలినురువులును, గల గంగానది ఎట్లు సరస్వతీ లక్షణము కలిగియున్నవో చూడుడు.

4. భగవతి:- భగ + వతి = అనగా సృష్టించుశక్తికలది ఆని అర్థము. వాక్కునకు సృష్టించు శక్తికలదు. వాస్తవమునకు ఈ సమస్త సృష్టియు వాక్కుగా బ్రహ్మదేవుని వాక్కువలన సృష్టింపబడినదే. కనుక ప్రతి వస్తువునకు మొదట శబ్దరూపమే యుండగా రెండవదిగా భౌతికరూపము కలుగును. మన భౌతిక భాషలో మాత్రము తొలుత భౌతిక రూపముండి తరువాత వాక్ రూపము కలుగునట్లుతోచును. మనము వాక్కును, శబ్దమును ఒకటే అనుకొనుట వలన అట్లు అగుచున్నది. కాని వాక్కు నాదరూపము, శబ్దము పదరూపము అని గ్రహించినచో ప్రతివస్తువునకు నాదరూపమైన వాక్కు సహజ సిద్ధమై పూర్వమే యుండునని తెలియును. ప్రతివస్తువునందు గర్భితమైయున్న నాదమే వాక్కు. దానికిని భౌతికముగ మనకు కనిపించు దానికి మనము పెట్టుకొను పేరునకు సంబంధము లేదు. కనుక బల్ల, గోడ, చెట్టు అనుపదముల శబ్దరూపముగాక పంచభూతములలో మొదటిదైన ఆకాశము నుండి వెలువడు వాక్కును గ్రహింపవల

యును. అదియే సమస్తవస్తు సృష్టి కారణమై, వాక్ తత్త్వము యోగ సాధనచేత విశుద్ధ చక్రమునందు దర్శనము చేసి: కవితావాక్కు ద్వారా వస్తు రూపమును సాక్షాత్కరింప జేయగలుగును. అక్కడ శబ్దము నిమిత్తమాత్రము.

ఉదా: ఇంతింతై వటుఁ డింతయై మరల తానింతై నభో వీథిపై నంతై
తోయదమండ లాగ్రమున
కల్లంతై... విజృంభించు వామనుడును

ఉదా:- నల్లనివాడు పద్మనయనంబుల వాడు...
మల్లియలార మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే...

అని శ్రీకృష్ణుని అన్వేషించు గోపికలును ఎట్లు రూపు దిద్దుకొనుచున్నారో చూడుడు.

(5) పూర్ణేందు బింబానన :- అనగా సరస్వతీదేవి నిండుచంద్రునివంటి ముఖము కలది అని అర్థము. సరస్వతి వాగ్రూపమైనది, కనుక ముఖమనగా 'మొదలు' అని గ్రహింపవలయును. ఒక వ్యక్తి ముఖము చంద్రునివలె నున్నపుడు ఎట్లు ఆహ్లాదమును కలిగించునో అట్లే ఒక వస్తువును వర్ణించినపుడు ప్రారంభము ఆహ్లాదకరముగా నుండవలెను. కొందరు మాట్లాడునపుడు కోపముగా తిట్టుచు పరుషముగా ప్రారంభింతురు. వారి వాక్కు హితోపదేశ గర్భితమైనను మొదలు ఆహ్లాదకరము కాకుండుటచే నిష్ఫలమగును. అట్లుగాక ప్రేమాభిమానములతో కూడిన పిలుపుతో ప్రారంభింపబడినచో వారివాక్కు ఉపదేశపూర్వకమై సఫలమగును. అట్లే లోకజ్ఞుడైన కవి మనోహరవర్ణన గావించునపుడు ఆహ్లాదకరములైన శబ్దముల నెన్నుకొని ప్రారంభించుట. అట్లైనచో అతని కావ్యము రమణీయార్థ ప్రతిపాదకశబ్దమై బ్రహ్మానందముల నొసగును. చంద్రుడు వృద్ధిక్షయములు కలవాడైనట్లే జీవుల వాక్కు కూడ హెచ్చుతగ్గులు కలిగి ఆహ్లాదము కలిగించుటలో తారతమ్యము కలిగి యుండును. ఇతరులలో పరమాత్మని దర్శించు యోగసాధనచేత వాక్కును నిండుచంద్రునిగా రూపొందించుకొని ఇతరులకు ఆహ్లాదము కలుగునట్లు మాటలాడుట నేర్చుకొనవలెను. అట్టిది కవిత్వమున సిద్ధించినచో అతని కవితాసరస్వతి 'పూర్ణేందుబింబానన' అన్నమాట. పోతన కవితలో ఇట్టి ఆహ్లాదకర ప్రారంభములు కోకొల్లలు.

ఉదా :- ప్రహ్లాద చరిత్ర ప్రారంభము

పుత్రుల్ నేర్చిన నేరకున్న జనకుల్
పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధి చెప్పి దురితో
న్మేషంబు వారింతురే
శత్రుత్వంబు తలంప రెట్టియెడ నా
సౌజన్య రత్నాకరున్
పుత్రున్ లోకపవిత్రు తండ్రి నెగులుం
బొందింప నెట్లోర్చెనో.

గజేంద్ర మోక్షణ కథా ప్రారంభము.

నీరాట వనాటములకు
పోరాటం బెట్లు కలిగె పురుషోత్తముచే
ఆరాట మెట్లు మానెను
ఘోరాటవినున్న భద్రకుంజరమునకున్.

ఈ విధముగా మహాయోగి అయిన పోతన కవితాసరస్వతి జగన్మోహనశక్తి కలిగి, విప్పారిన పద్మములవంటి కన్నులతో సృష్టిని దర్శనము చేయించుచు, మహాప్రవాహమయమై పరమాత్మని లీలలను యోగదర్శనమున ననుభూతమొనర్చుచు, వర్ణ్యవస్తువులను సమగ్ర సుందరముగ సాక్షాత్కరింపజేయుచు, ప్రారంభమునుండి పరిసమాప్తివరకు పరిపూర్ణమైన ఆహ్లాదము నొసగుచు, తెలుగువారి హృదయములందు భక్తిమయమైన వెలుగులను వెదజల్లుచున్నది.

—...—

# నూతలపాటి కవితా పద్ధాటి

– రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ.)

కీ॥ శే॥ నూతలపాటి గంగాధరంగారు తెలుగు పాఠకలోకానికి సుపరిచితులు. అనేక పత్రికలలో కండగల, వారి కవిత్వాన్ని పఠించి, సహృదయులు శ్లాఘించారు. కవిసమ్మేళనాలలో, వారి నిగళాలు లేని గళం శ్రోతలలో ఆలోచనలు రేపింది. ప్రాచ్యకళాశాలలో చదువుకొన్న విద్యావంతులు. చక్కనిచిక్కని భాషా సంపదను, ఔచిత్యాన్ని సంతరించుకున్నారు. సొంత శైలిని సంతరించుకున్న కొంతమందిలో శ్రీ గంగాధరం గారొకరు. అనేక ఉత్తమ కవితలను తెలుగు పాఠకలోకానికి అందించిన అమృతమూర్తి ఆయన. కలంతోపాటు పొలంపని కూడా చూసుకొనే కృషీవలుడు కావడంవల్ల అటు కవిత్వంలోను, ఇటు వ్యవసాయంలోను విశేషంగా కృషి చేసి బంగారుపంటలు పండించారు. పల్లె పిల్లల సొగసు, విరిసిన మల్లెల సౌరభం, కురిసిన వెన్నెల తుషారం ఆయన కవిత్వంలో కన్పిస్తాయి. ఆయన అభ్యుదయకవి. అ. ర. సం. లో ఆయన సభ్యులుగా ఉండేవారు. శ్రీగంగాధరం గారు ఆధునిక సాహితీవనంలో విరిసిన ముద్దమందారం, ఆధునిక కవితాప్రస్థానంలో వారి దొక ప్రత్యేక స్థానం, ఆధునిక కవిత్రయం అనదగిన (నాదృష్టిలో) శ్రీగుంటూరి శేషేంద్రశర్మ, శ్రీగంగాధరం; శ్రీ ఎల్లోరాలకవిత్వంలో అనుభూతి ప్రధానం. పదలాలిత్యం, భాషా వైదుష్యం, భావనాపటిమ, సౌందర్యావిష్కరణ, శిరీషకుసుమ పేశలసుధామయోక్తులు; విచిత్రమైన పదచిత్రణలు 'వారి కవిత్వాన్ని' మళ్ళీమళ్ళీ చదివిస్తాయి.

శ్రీ నూతలపాటి అనల్ప కల్పనాశిల్పి. మంచి కవేకాదు, మంచి విమర్శకుడు కూడా. ఆయన "వివిధ సాహిత్య విషయాలపై వ్రాసిన విమర్శలు, వ్యాఖ్యలు "సాహిత్య రసగంగాలహరి" అనే గ్రంథంలో చోటుచేసుకున్నాయి. ఆయన కవిత్వంనిండా, వెన్నెల వాన, మల్లెల పరీమళం ఉండేలా రసప్లావితంగా, సుమనోహరంగా, అనితర సాధ్యమైన పద్ధతితో రచనావ్యాసంగాన్ని నిర్వహించారు. ఆయన ఆధునిక, కవితానిర్మాతేకాదు, నిర్ణేతకూడా. ఆయన కవిత్వంలో పల్లెటూళ్ళ సొగసుంది. పట్టణాలవర్ణనుంది. శ్రామికునికి అద్వితీయమైన స్థానంఉంది. ఆయనకవిత్వంలో ఆర్తిఉంది, సౌందర్య స్ఫూర్తిఉంది. పతిత లున్నారు, భ్రష్టులున్నారు. ఆయన కవిత్వం, వాస్తవానికి ప్రతిబింబం. తనికవిత్వాన్ని ప్రజాబాహుళ్యానికి అందుబాటులో ఉండేరీతిలో వ్రాసాడు. "నిరంకుశాః కవయః" అన్నట్లు ఎవర్నీ లక్ష్యపెట్టక, భగవంతుడికి, కూడా భయపడక, తాను చెప్పదల్చుకున్న విషయాన్ని నిస్సందేహంగా, నిర్భయంగా, నిక్కచ్చిగా చెప్తాడు. ప్రజల్ని ప్రగతిపథంలో నడిపించడానికే, కవిత్వాన్ని సాధనంగా వాడుకున్నాడు.

శ్రీ గంగాధరం తనకవితలని రెండు సంపుటాలుగా వెలువరించాడు. 1968లో "చీకటినుంచి" అనే కవితా సంపుటి, తర్వాత ఈమధ్య "వెలుగులోనికి" ... అనే కవితాసంపుటి. వారు వ్రాసిన కవితలు రాశిలో తక్కువే కాని, వాసిలో ఎక్కువే. గణంకాదు మనకు కావల్సింది గుణం. వారికవిత్వంలో కవితాగుణం పుష్కలంగాఉంది. దానికితోడు భావానా బలం అమోఘం, అద్భుతం, పూవుల మెత్తదనం, తేనెలతియ్యదనం, తుమ్మెదల పాటల కమ్మదనం, వెన్నెలచల్లదనం, చుక్కల చక్కదనం మిళితమై కవితలు రసజ్ఞుల హృదయాలను పులకింపచేస్తాయి. కొన్ని కవితలు ఉయ్యాల లూపుతాయి. మరి కొన్ని ఉద్రూత.బాగిస్తాయి. నిజమైనకవిత్వాన్ని సజావుగా వ్రాసిన ప్రజాకవి నూతలపాటి. అక్కడక్కడ అనులిన కోమల శృంగారాన్ని కవితలో రంగరించాడు. రంగురంగుల హరివిల్లును మన ముందు సాక్షాత్కరింప చేసి, విరిజల్లును కురిపిస్తాడు. అస్పష్టత ఉండదు. శబ్దాల డబ్బా వాయించడు. సమాసాలచేత కుస్తీ పట్టించడు. భావాలలావా వెదజల్లినా, భావాలచేత శీర్షాసనం ప్రాక్టీసు చేయించడు. సర్రియలిజంచేత వెర్రితలలు వేయించడు. గాడిదమీద మూటలు మోయించునట్లు కవితలో మాటలు మోయించడు. బాల పల్లవకోమల వాగ్దేవిచే బస్కీలుతీయించి, కుస్తీలు పట్టించడు. నవరసాలనందన బృందావనాలకు పాఠకుల్ని తీసికెళ్ళి సుగంధాన్ని, మరందాన్ని అందిస్తాడు.

నవపల్లవ కోమల కవితాసతిని మనకు దర్శింప చేస్తాడు. ఇజాలకు (చెడుఇజాలకు) ఉరిగా, నిజాయితీకి ఊపిరిగా నిలుస్తాడు. అంతవరకు ఆయన వ్యక్తిత్వం గురించి విన్నారు. (చదివారు.) ఆయన కవితావిపంచి పలికించిన హిందోళరాగల హరి అందుకోండి. దేవునిముందు నిలచి, తన గొంతు తెరచి, ఎలుగెత్తి (దేవుడిని) పిలిచి అర్చిస్తున్నాడు. ఏమని ప్రార్థిస్తున్నాడో చూడండి.

మళ్ళీ నీచెంతకు రావా లనుకున్నాను
మరుపురాని- మాఅవలేని విధంగా
మధుర మోహనంగా - అలంకరించుకుని
మళ్ళీ నీ చెంతకు రావా లనుకున్నాను
నవవధువులా, సరసుని చదువులా.

మంచులో తడిసిన మల్లెలా
ప్రజోపయోగకరమైన మల్లెలా
కరుకుదేరిన వరిపైరులా
గిరిశిఖరంనుంచి జారే సెలయేరులా
హరివిల్లులా, విరిజల్లులా
రసగీతంలా, మధురసంగీతంలా
హృద్యంగా, అనవద్యంగా
అనితర సాధ్యంగా
అలంకరించుకుని, నీచెంతకు రావాలని
ఆథిలో అనుగుపెట్టానో లేదో."

వీథిలో ఆయనకి తల్లిలేనిపిల్ల ఏడుపువినిపించింది. ఆడపిల్లతండ్రి గుండె బరువు, కడుపు చెరువు ప్రశ్నార్థకాలై కనిపించాయి. అయినా గుండెనిబ్బరంచేసుకుని ఒకఅడుగు ముందుకు వేసాడు. అక్కడ ఏంచూసాడో తెలుసా!

"నిలువెల్లా తడిసిన వాళ్ళు
నిప్పులదారిని చూచి జడిసినవాళ్ళు
కాలిన కడుపును కన్నీటితో నింపడానికి
వృథాప్రయత్నం చేసేవాళ్ళూ,
ఆయుస్సంతా అనారోగ్య సర్పానికి
ఆహుతిచేసి
అకాల మృత్యువుకోసం ఎదురు
చూచేవాళ్ళూ
బాధల కూడలిలో, నిరాశా వేదిక
మీదనిలిచి
నిస్తేజంగా దిక్కులుచూచే వాళ్ళు,"

వాళ్ళందర్నీ చూసి, తన్ను తాను చూసుకుని, ఎందుకీ అలంకారం అని ప్రశ్నించుకుని, సిగ్గుపడ్డాడు. "భగవానుని ముందునిలిచి, బాధతో వగచి" ఇలా అంటాడు.

భగవాన్ నన్నుక్షమించు
వీళ్ళని వదలి ఇలా అలంకరించుకుని
ఒంటరిగా నీచెంతకు రాలేను
వీళ్ళతో పాటేనేనూ.

# రాళ్ళపల్లికి శ్రీవారి పిలుపు

— శ్రీ బాడాల రామయ్య, ఎం.ఏ., పిహెచ్.డి.



ఈసారి మార్చికే ఎండలు మండిపోయెవి. 12వ తేదీ సోమవారం. మామూలుగా మహారాజా కాలేజికి పోతిని. కాని అక్కడ ఒక్క పిక్క కనపడలేదు. సమ్మెయే యయింతే విద్యార్థులు తరగతులకు రారుకాని కాలేజీచుట్టూ కాలుగాలిన పిల్లులవలె తిరుగుతుంటారు. ఎందుకో నాడు మా కాలేజీ మూగవోయుంది. విశేషమేమో యనుకుంటూ ఎందుకుపోయి నల్లబల్ల చూచి స్తబ్ధుడనైపోతిని. పెద్దపెద్ద అక్షరాలతో '30ఏండ్లు కాలేజీలో తెలుగు ప్రాధ్యాపకులుగా పనిచేసిన రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు దివంగతులైరి. ఆయన స్మరణార్థమై కళాశాల మూయబడిం' దని వ్రాయబడియుంట చూచితిని. ఇంతలో మా ప్రిన్సిపాలు పిలుస్తున్నారని విని ఆయనను కలుసుకుంటిని. శర్మగారి ఆకస్మిక మరణమునకు విచారించుచు, వారి సేవను, పాండిత్యమును గూర్చి విశేషముగా చర్చించిరి.

కన్నడదేశమున నేటికీ శర్మగారన్న పండితులయందే కాక అధికారులకునుగల గౌరవ మెట్టిదో గ్రహించి, తెలుగువాడనుగా మురిసిపోతిని. 25 ఏండ్ల నుండి నాకు వారితో గల పరిచయమును, తలపోస్తూ వారి వాత్సల్యం, ప్రామాణికత, కలస్పర్శి పాండిత్యం, రసికత, వాల్మీకి రామాయణముపై వారికిగల భక్తి ప్రపత్తులూ ఈ యన్నింటిని గుబాళింపచేసే వారి రచనలు, అందలి తెలుగు నుడికారపు సొగసులు ఒక్కసారి స్ఫురణకు వచ్చినవి. ఇక యీ మహాశక్తి తెలుగువారికి దూరమైపోయెనే యని చెప్పుకోలేని బాధ కన్నులనీరు నింపినది. ఆతని స్థానములో నున్న నా చిన్నతనమునకు సిగ్గుపడుతూ ఎటులో ఇంటికిచేరుకుంటిని.

22-3-1978 లో వారు నాకత్యంత ప్రీతితో నిచ్చిన వారి రచనలు చూచితిని. అందే ఆనాడే నాకు వారు చూడు మని యిచ్చినవారి జాతకచక్రము కంటబడెను. పొంగివచ్చే దుఃఖాన్ని అడచుకొంటూ కాలంచేసే ఇంద్రజాలానికి నిస్సహాయతతో వెతపడుటయే గాని ఎవ్వరు మాత్రమేమి చేయగలరు ? ఆయన 2-1-1892 నందన నామసంవత్సరములో పుట్టి 11-3-1979 కాళయుక్తిలో గలిసిపోయిరి. అప్పటి నావెత యీ గీతాలలో స్పష్టాస్పష్టమైనది.

నందన మరల నందన నందియు తుది
కాళయుక్తి యీస్వామిని గావుకొనియె
ఎన్ని భావంబు లాలుకునో యీ యనంత
కృష్ణుని మధురగంభీర కృతుల దరచ॥
మోముపై కృష్ణపాదంబు ముద్దులొలుక
నోట నవరత్నకాంతులు దీటుగొనగ
మంత్రముగ్ధమా మాటలు మరులుగొలుప
ఇత డనంతుడే యనుకొంటి నెఱుగకింత॥

రెడ్డి లేని లోపంబు పూరించితీవు
నీవులేని లోపంబింక నెవ్వరయ్య
తీర్చువారు ? విమర్శకధీమణీ ప్ర
మాణమే పడిపోయెనే మా బ్రతుకుల॥
విశ్వనాథునితో ప్రాక్కవిత్వ ముడిగె
రాళ్ళపల్లితో నెరివిమర్శావిలాస
ముడిగె యీయాంధ్రసాహిత్యమందు నేటి
తో నొక మహోజ్వల యుగంబు తొలగి
పోయె॥

79 మార్చి 11 వ తేదీ ఆదివారం సాయంకాలం 4.15 గం॥లకు ప్రసాద రావుగారు (Excutive Officer) తిరుపతి తిరుమల దేవస్థానం వారి తరఫున బెంగళూరులో రాళ్ళపల్లి వారి యింటికి వచ్చి, శ్రీవారి ఆస్థాన విద్వాంసునిగా శర్మగారిని నియోగించినట్లు తెలుపుటతో వారిని ఉచితరీతి సత్కరించిరి. ఆ దినమే రాత్రి 6.15 గం॥లకు శర్మగారు శాశ్వతంగా యీ లోకాన్ని విడిచి స్వామివారి ఆస్థానమునకు వెడలిపోయిరి. ఈ యెడబాటునకు ఆయన బంధువులతో పాటు మన సాహిత్యలోకమే ఏడ్చినది.

తెలుగుపలుకులరుచి కన్నడుల కెవండు
చూపె సంగీతసాహిత్య సుధలబ్రతుకు
నెవడు పండించుకొనియె నాకృష్ణశర్మ
పూర్ణరూపునితో బరిపూర్ణుడయ్యె॥
రాలెనో తార నిశ్చలప్రభ వెలిగెనో !
ఊడెనో పండు నుడితల్లియొడిని బడెను!
ఆగెనో గళంబు జగంబు నలముకొనెను!
కృష్ణుడే లేని లోకమే కృష్ణ యయ్యె ॥
మెత్తనియెడంద, చులుకైనమేధ రాము
నెమరు వేయుభక్తి, ప్రమాణనిష్ఠ, కళల
కలిమి, నుడిగుట్టు తెలిసి వెంకన్న నిన్ను
దరికి పిలిపించుకొనె ధన్యతముడవోయి॥

—...—

## బి. వి. అండ్ కో., పుస్తకములు

బి. ఏ., బి. యస్ సి., బి. కాం. తరగతుల I, II సంవత్సరముల తెలుగునోట్సు (ఆంధ్రా యూనివర్సిటీ) ప్రతులు అన్నియు అయిపోవుటకు సిద్ధముగానున్నవి. కావలసినవారు త్వరపడుటమంచిది. వచ్చేసంవత్సరమునకు మారే అవకాశమున్నందున పునర్ముద్రణము జరగదు.

**బి. వి. అండ్ కో.,**
6 - 8 - 7, ఇన్నీసుపేట
రాజమండ్రి - 1.

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతి దీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

— సంపాదకుడు.

అడ్రసు :—
సంపాదకుడు, విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి,
Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్), రాజమండ్రి-1.

## —* 'సమాలోచన' ప్రకటన రేట్లు *—

| | | | |
|---|---|---|---|
| కైటిలు 4 వ పేజీ | పూర్తి పేజీ | ఒకసారి ప్రకటనకు | రు. 150. |
| ,, | ½ పేజీ | ,, | రు. 80. |
| ,, | ¼ పేజీ | ,, | రు. 50. |
| మిగిలిన పేజీలలో | పూర్తి పేజీ | ,, | రు. 100. |
| ,, | ½ పేజీ | ,, | రు. 60. |
| ,, | ¼ పేజీ | ,, | రు. 40. |

కంట్రాక్టు రేట్లకు సంపాదకుని పేర వ్రాయండి.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.

# శ్రీమత్కవి కర్ణరసాయన సకల వర్ణనాపూర్ణ రామాయణము

- శ్రీ డా॥ జి. చలపతి, ఎం. ఏ., పిహెచ్. డి.



సంస్కృత వాఙ్మయమున వాల్మీకి ఆదికవి. వాల్మీకికోకిల విలపించిన మధురమైన కరుణరస ప్రవాహము రామాయణము. రామాయణ గానము వలన సర్వపాపములు తొలగునని నమ్మకము. జనుల లౌకిక-ఆధ్యాత్మిక జీవితములతో మిళితమై పోయిన కమనీయ కావ్యము రామాయణము. అందువలన ఇది సకల పురుషార్థ ప్రదాయకము, పారాయణయోగ్యము. పితృప్రేమ, సోదరవాత్సల్యము. నిర్మల దాంపత్యము మొదలగు విశిష్ట ధర్మముల అపూర్వసృష్టి. మహర్షి నోటినుండి అనర్గళముగా వెలువడిన ఈకథా ప్రవాహము లోకమును పునీతము చేసినది. మానవునికి వివిధ దశలలో కలుగు మానసిక సంఘర్షణలకు రామాయణము ధర్మబద్ధమైన పరిష్కారము చూపును. "ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్' అని వాల్మీకములోనే కలదు.

ఆంధ్ర సాహిత్యములో నన్నయభట్టు రాఘవాభ్యుదయము మొదలుకొని విశ్వనాథవారి కల్పవృక్షమువరకు ఎన్నో రామాయణములు వెలసినవి. వీనిలో కొన్ని చంపువులు, కొన్ని ద్విపదలు, కొన్నివచనములు- ఒకే కావ్యమును ఇంతమంది కవులు వ్రాయుటలో రామాయణము యొక్క గొప్పతనము తెలియును. రామాయణ కావ్యగానము నిత్యనూతనము. రామకథా సౌందర్యము ఒక్కొక్క కవికి ఒక్కొక్క తీరులో దర్శన మిచ్చినది. ఎందరు వర్ణించినను రాముని గుణములు పర్యాప్తములు కావు. కొందరు కవుల రచనలకు ప్రశస్తి కలుగుచుండును. కొందరి రచనలు మరుగునఁబడుచుండును. అట్లు మరుగునఁబడిన వానిలో 'శ్రీమత్కవి కర్ణరసాయన సకల వర్ణనా పూర్ణరామాయణ' మొకటి.

ఈకావ్యకర్త చిత్రకవి వెంకటరమణకవి. ఈకావ్యములోని ఆశ్వాసాంత గద్యవల్ల కవివిషయము కొంత తెలియును. ఇతడు లక్షణసార సంగ్రహకర్తయైన చిత్రకవి పెద్దన పౌత్రుడు. హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యాత. (ఈవ్యాఖ్యానం ఎక్కడుందో తెలియదు) చిత్రకవి అనంతయ్య పుత్రుడు. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి భక్తుడు. కావ్యము ఈస్వామికే అంకితము. ఇతని రచనలు - రాఘవపాండవీయ, విష్ణుచిత్తీయ, హరిశ్చంద్ర నలోపాఖ్యాన కావ్యములకు వ్యాఖ్యలు (ఇవి అలభ్యములు), సాంబవిలాసము, అభిమన్యువిలాసము, కుమార గురు విలాసము అను కావ్యములు, త్రిలోక సంజీవిని అను లక్షణగ్రంథమును. వీనిలో రామాయణ, సాంబవిలాసములు, రెండు మాత్రమే లభ్యములు. ఇవి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాలయములో ఉన్నవి. చిత్రకవి పెద్దన కాలము క్రీ. శ. 1580 గా పరిశోధకులు నిర్ణయించుటచేత వెంకటరమణకవి 17 వ శతాబ్దమునకు చెందినవాడని భావింపవచ్చును.

ఈ రామాయణము ఒక ప్రబంధము. 'సకల వర్ణనాపూర్వ' అన్న పేరులోనే దీని ప్రబంధ లక్షణము ధ్వనించును. కథననుసరించి గాని, కథలోని పాత్రలననుసరించిగాని కవులు తమ కావ్యాలకు నామకరణము చేయుదురు. వెంకటరమణకవి 'శ్రీమత్కవి కర్ణసాయన సకల వర్ణనా పూర్ణరామాయణము' అని పేరు పెట్టెను. సకల వర్ణనలతో (అష్టాదశ వర్ణన లని కవిభావ మేమో) కూడి కవుల కర్ణములకు రసానందము కలిగించుట తన కావ్యలక్షణ మని కవి భావించి యుండును. ఈ కావ్యావిర్భావమునకు పూర్వమే సంకుసాల నరసింహకవి విరచిత 'కవికర్ణరసాయనము' వచ్చినది. నామకరణ విషయమున వెంకటరమణ కవిపై నరసింహకవి ప్రభావ మున్న దనవచ్చును. తెలుగులో ఇటువంటి పేర్లతో 'కవివాగ్బంధము' వంటి లక్షణగ్రంథములున్నను కవికర్ణరసాయన కావ్యావిర్భావ కాలమువరకు కావ్యములకు ఇట్టి పేర్లులేవు. రావిపాటి త్రిపురాంతకుని 'ప్రేమాభిరామము' గీర్వాణ భాషలో విలక్షణ నామముగలది. ఇది తరువాత వచ్చిన కవికర్ణరసాయన, కవిజనరంజన, కవిరాజ మనోరంజన, రసికజన మనోభిరామ మిత్యాది కావ్యనామములకు ప్రేరకమేమో పరిశీలింప వలసియున్నది. ఈ రామాయణమున ఆరుకాండలుగలవు. కథ వాల్మీకమున కధీనమే చెప్పుకోదగిన మార్పులు కానరావు. సుమారు రెండువేల గద్య పద్యములలో గల ఈ రామాయణము ప్రబంధ లక్షణ శోభితము. శైలి ప్రబంధశైలి. చిత్రకవిత్వము. బంధ కవిత్వము అధికముగా నున్నది. పరిశీలించిన లక్షణసార సంగ్రహమునకు ఇది లక్ష్యముగా నున్నట్లు కనిపించును.

కావ్యము అయోధ్య వర్ణనతో ప్రారంభమగును. ఇది అచ్చము ప్రబంధ ధోరణిలో నడిపింపబడిన కథ. అయోధ్య కాండములో ఉండవలసిన దశరథుని శాపవృత్తాంతము ఇందు బాలకాండమున కలదు. ఈ సందర్భమున దశరథుని వేట విపులముగా, దీర్ఘముగా వర్ణింపబడినది. ఇది మనుచరిత్రలోని స్వారోచి వేటను పోలి యున్నది. ముని పుత్రశోకమున మరణింతు వని దశరథుని శపించిన సంద

గర్భమున అనపత్యదుఃఖము ఎక్కువగా వర్ణింపబడినది. వేటకు వచ్చునాటికి దశరథుడు వివాహితుడు. కాని అనపత్యుడు. ముని శపించునంతవరకు ఆతనికి సంతాన విషయము జ్ఞప్తికి రాలేదు. ఈ శాపము తరువాత పుత్రకామేష్టి జరుగుటకు హేతువైనది. ఈ ఘట్టమును బాలకాండలో వర్ణించుటకిదే ప్రయోజనము.

శ్రీమహావిష్ణువు రాముడుగా అవతరింప వలసిన ఆవశ్యకత గూడ బాలకాండమునందే వివరింపబడినది. దేవతలు, మహర్షులు విష్ణువును దర్శించి రావణాద్యసురులు తమకు కల్గించు క్లేశములను చెప్పుకొనుటతో ఈ ఘట్టము ప్రారంభమై ధర్మస్థాపనకు భగవంతుడు రామావతారము ధరింతునని అభయప్రదానము చేయుటతో ముగియును. ఈఘట్టమును వెంకటరమణకవి తన కావ్యమునకు ప్రస్తావనగా రూపొందించుకొనెను.

శ్రీరామ పట్టాభిషేక సందర్భమున దశరథుడు తన ప్రజలనుండి, సామంతుల నుండి రామునికి పట్టాభిషేకము చేయుటకు అనుమతి పొందినట్లు, ఆమాట విన్నంతనే ప్రజలు మేఘమును గాంచిన మయూరముల వలె సంతోషించినట్లు వాల్మీకి కథాసరణి. ఈ కావ్యమున దశరథుడు వశిష్ఠాది మహర్షులతో మాత్రము ఆలోచించినట్లు చెప్పబడినది. వాల్మీకమున మంథరకు రామపట్టాభిషేక వృత్తాంతము ముందుగా తెలియదు. ఈ కవి మంథరకీవిషయము ముందే తెలిసి ప్రతిక్రియ ఆలోచించినట్లు కల్పించెను. కథాదృష్టితో చూచినపుడు ఈ స్వల్పమైన మార్పులు మాత్రము కనిపించును.

కథాకథమునందును, పాత్రపోషణము నందును వెంకటరమణ కవికి తగినంత శ్రద్ధలేక పోవుటచే అచ్చటచ్చట అనౌచిత్యదోషము లున్నట్లనిపించును. కవి ప్రబంధ దృష్టితో సాగిపోయినప్పటికి రామాయణమును పవిత్రమైన కావ్యముగా భావించువారి హృదయముల కివి ములుకులుగా తోచును. ఇందు శ్రీరాముని ధీరోదాత్తత భంజింపబడినది. ఈకవి దృష్టికి రాముడు శీతోష్ణ స్థితులకు ఓర్వలేని సామాన్య పామరుడువలె తోచినట్లున్నది. సీతను కోల్పోయి విరహమనుభవించు సందర్భమున రాముడు ప్రబంధ నాయకుని కంటె హీనాతిహీనముగా వర్ణింపబడినాడు. వియోగాగ్నిచే తపించు రామునికి లక్ష్మణుడు శిశిరోపచారములు చేయును. లక్ష్మణుడు వివాహితుడను మాటనుగూడ విస్మరించి రాముడు తన పూర్వదాంపత్య రహస్యములను విరహమును ఏకరువు పెట్టును. సీత జారవిడిచిన చూడామణిని అక్కున జేర్చుకొని సమాగమము పొందిన వానివలె ప్రలాపించును. ఈసందర్భమున సీత ప్రత్యంగ వర్ణన మొక ప్రధాన ఘట్టము. సీత స్తనద్వయవర్ణన పది పద్యములలో సాగును. సీతారాముల పూర్వపు సురత వర్ణన విపులముగా చేయబడినది.

ఈ కావ్యమున కథాంశము తక్కువ. వర్ణనలెక్కువ. అనౌచిత్యము లనిపించినను ఆతని వర్ణనలు మనోహరములై పాఠకుని ఆలోచనోన్ముఖుని చేయును. విచ్చలవిడిగా వర్ణించినను వెంకటరమణ కవి తన వర్ణనలలో భవిష్యత్కథా సూచన చేయుచు సందర్భమునకు శోభను కలిగించుచుండును. శరత్కాల వర్ణన సందర్భమున – శరదృతువు "సర్వమహౌషధి సంతానముల కెల్ల పూర్వ జన్మార్జిత పుణ్యఫలము" గానున్నదని చెప్పెను. శరత్కాలమున చంద్రుడు స్వచ్ఛముగా ప్రకాశించును గావున ఓషధులు శక్తిమంతములుగా నుండును. ఈ కారణముచేత చంద్రకిరణములు ఓషధులకు పూర్వజన్మార్జిత పుణ్యఫలముగా చెప్పబడినవి. ఈ ఓషధుల ప్రశంస లక్ష్మణుని మూర్ఛ – సంజీవి న్యౌషధ చర్చలయందు పర్యవసించి భావి కథాసూచన పాఠకునికి కలుగునట్లు చేయును. రామలక్ష్మణులు వానరులను చూచు సందర్భమున వానరులు "కాలదండంబులకైవడి పావక కీలలగతి పొల్చు వాలములు" గలిగి యుండిరట. పావక కీలల వంటి వాలములు అనుటలో హనుమంతుని వాలమునకు నిప్పంటించు ఘట్టము మన కండ్లముందు మెదలును. అశోకవనమున శోకముతో నున్న సీతను సమీపించి రావణుడు తన అందముచే ఆకట్టుకొన ప్రయత్నించుసందర్భమున–'పార్శ్వభాగములందు భయముమై నప్సరస్త్రీలు వింజామర లోలి విసర, ... " అను పద్యమున రావణుని రాక్షసరీతి వర్ణింపబడినది. ఈ పద్యమున రావణుని సౌందర్యము, భయంకరత్వము సమముగా చెప్పుట వలన సీతాదులకు ఇతడు పరమ రాక్షసుడుగాను, రాక్షసస్త్రీలకు మిక్కిలి సౌందర్యవంతుడుగాను కనపడినాడు. అందమునకు పతాకలైన అప్సరసలు వీనికి వింజామరలు విసరినట్లు వర్ణింపబడుటవలన సీత వీరికంటె సౌందర్యవతియని, అందుకే రావణుడు ఆమెను మోహించెనని తెలియును.

కవి మానసిక ప్రవృత్తికి ప్రతిబింబము శైలి. ఈకవి శైలి కొంత క్లిష్టము, కొంత సుకరము. మొత్తముమీద ప్రబంధకవుల ఆడంబర శైలి. యుద్ధము, అరణ్యము, పర్వతము, సముద్రము మొదలగు వాని వర్ణనకు వచనమే నియతముగా వాడబడినది. విశేష వృత్తములు అధికముగా వాడబడినవి. ఇతడు వాడిన విశేషవృత్తములు–

1. ఖడ్గబంధము 2. సుగంధివృత్తము 3. వర్గపంచరహిత కందము 4. వృత్త కంద గర్భితసీసము 5. స్వ్రసమితాక్షర కందగర్భిత ద్వినాగ బంధము. 6. ద్వివిధ కందము 7. చలజింహా 8. ఓష్ఠ్యనిరోష్ఠ్య

సంకరము 9. ఛురికాబంధము 10. కలాల చక్రబంధము. వీనిలో సప్రమితాక్షర కంద గర్భిత ద్వినాగబంధ, చలజింహ, కలాల చక్రబంధములకు లక్షణ గ్రంథములలో లక్షణములు గనిపించవు. ఇతడు వ్రాసిన 'త్రిలోక సంజీవిని' అను లక్షణ గ్రంథమున కల వేమో. ఇతని శైలికి కొన్ని ఉదాహరణములు -

"శూరులై సద్గుణో దారులై వైరి సం
హారులై జగదేక వీరులగుచు
ధీరులై దాన మందారులై నీతి సం
చారులై సత్కళోదారులగుచు
ధన్యులై సత్యసన్మాన్యులై భూరి సౌ
జన్యులై రాజ మూర్ధన్యులగుచు
భవ్యులై సకల రాడ్సేవ్యులై పాలిత
దివ్యులై వరదయా నవ్యులగుచు
వినుతకీర్తుల సింహసంహననమూర్తు
లాకుమారులు నానాటి కమిత కళల
కుముదహితులట్లు కరికలభముల సరణి,
దరణినభివృద్ధి నొందిరి తరణి రుచుల.'

"శ్రీరామ జంఘ్మూసమీరాభిహతిచేత
రావణాంభోదంబు రసనడంగ
లక్ష్మణాగ్రజ నమల్లసిత వజ్రంబుచే
దశకంఠ వసుమతీ ధరముద్రెళ్లె
శ్రీరఘూద్వహ మహాసింహ విక్రమరేఖ
రాక్షసాధిప సింధురంబు మ్రగ్గె ..."

"కోరలు పెరికిన భుజగము, దారిక్
సటలం బెకల్పదగియెడు మదకం
ఠీరవము లీల ......"

చాలమంది కవిచరిత్రకారుల దృష్టికి వెంకటరమణకవి ఒక అజ్ఞాతకవి. ఆంధ్ర కవితరంగిణీ కారుడు ఈ రామాయణము పిండిప్రోలు లక్ష్మణకవి వ్రాసిన 'రావణ దమ్మీయము' వంటి దని వ్రాసి మరల ఇట్లూహించెను. "ఈకవిపై నెవ్వరో అభియోగము తేగా ఆతనిని రావణుడు గాను, (......) రాముని గాను పోల్చి యీగ్రంథము రచించెనట. ఇందు రామాయణ మేడు కాండలు గలవు. ఈతని పై

# ప్రసన్న కుసుమాయుధం - తత్త్వదర్శనం

- శ్రీ శివలెంక ప్రకాశరావు, ఎం. ఏ.

( గత సంచిక తరువాయి )

కామధేనువు : - రామలింగ కవికి దారిలో ఒక శిరోజము దొరికెను. అది యెవరిదా అని స్వర్గమెల్ల గాలించినా డాతడు. ఆట్టి శిరోజములు గలదానినే పొందదలచి తాను కోల్చ్ కామధేను వా కోరిక తీర్చగలదని యెంచెను. చివరకు గంగాతీరరంగమున జలకాలాడు పడతిదే ఆశిరోజ మని నిశ్చయించెను. ఆమె చూచి తన్ను ప్రియగా స్వీకరింప వేడెను. ఆత డామె ముద్దుపళని అనిగ్రహించి నిట్టూర్చి 'రసోజ్జ్వలములైన కృతుల్ గచియించి వేల్పుటారికి పఱతెంచినారమ రరే! యిట నేనొకరంభజోత నీవొక నలకూబరాశిపమ్ము బొందినగా క ఫలంబు గల్గునే?' 'నాకునవచ్చు నచ్చ రను నేనాచుకొంగు-నీకునచ్చు నిర్జర జారు నీవు గొనుము' అని చెప్పి వెడలి పోవుటలో స్వర్గసుఖముల నందగోరు మానవస్వభావమును కవి నిరూపించినాడు.

తరువాత ఒకరిపై నొకరు కోపముతో వేసికొన్న అపవాదులవలన నిర్జరు లెవ్వరును వారికి లభింపలేదు. దానితో వారిద్దరు నాకములో నున్నను అది నరకముగా

---

అభియోగము తెచ్చినవాడెవ్వడో, అయభియోగమున నీతని పక్షమున తీర్మానించిన న్యాయకర్త యెవ్వడో తెలిసినగాని యాతని పద్యములందలి శ్లేషను గ్రహించి యానందింపలేము. ఈగ్రంథము శిథిలావస్థయం దుండుటచే ఆవిషయములను సంపూర్ణముగా గ్రహింప ననువుగాలేవు" చాగంటి శేషయ్యగారి ఊహ నిజమైన ఇది మంచి అధిక్షేప కావ్యమగును.

కాన్పించెను. అప్పుడు రామలింగడు నిగమశర్మను ముద్దుపళని కడకు దూతగా పంపును. ఆమె సుముఖతను తెలిసికొని అక్కడి కేగి క్షమాభిక్ష వేడెను. ముద్దుపళని రామలింగనికి సర్వసుఖము గూడ గూర్చెను. ఈ సందర్భమున కవి

'హారతులై కటాక్షములు
నవ్వన జేర్చుటలేటి కోర్కు లై
యూరుపు తూపమై సురుచి
రోష్ఠసుధారుచు లారగింపులై
హారములై నఖక్షతము
లబ్బములై కుచముల్-రదద్యుతుల్
చేరువదివ్వెలై, తనభి
షేకములై ప్రమదాశ్రువుల్ తగన్"
(61 ప)

'రామలింగని బూజించె రసలలామ
రమ్యమధురానుభవ రమారామసీమ;
ఆమె దగుపురుషాయి తాటోపమునకు
లొంగి రామలింగము రాములింగమయ్యె'
(ప 62)

అని వర్ణించుటలో భక్తి పారవశ్యమును 'అపడక్షీణసుఖం బనంగు డయి, స
ర్వాంగోజ్జ్వలాలింగనా
మిష సర్వంకషతన్ జతుర్భుజుఁడునై
మీనేత్రనోద్య ద్వపు
స్సుషమాలోకనమున్ రసజ్ఞకమలా
క్షుండై సహస్రాక్షుఁడై
ఝష కేతుస్తుతి కల్పచుంబన కళా
స్థానిన్ జతుర్వక్త్రుఁడై' (63 ప)
అను టలో త్రిమూర్త్యాత్మకమూర్తిమత్త్వము పొందుటను,

'హాస్యచతురాస్యుడైన మహాకవీంద్రుఁ
డంచెలంచెలుగాఁ బ్రదర్శించునపుడు
విరహవీరశైవమ్మును వీడుకొలిపి
సురత వైష్ణవశృంగార శూరుడయ్యె'
(69 ప)

ననుటలో అద్వైతస్థితిని,

'స్వర్గమందు, పళనిసాంగత్యమునం గేళపాళమహిమ నత్యపూర్వకవి సుపర్వుడై రహించె' (ప. 57) నని తెలియజేయుటలో రామలింగడు పొందిన అమరత్వమును స్పష్టపరచినారు.

కాముని పున్నమ :- తిలోత్తమ తన ప్రమదావనములో నుండగా కొలువుదీరియున్న ఆంధ్రకవులతో నొకచెలికత్తె తిలోత్తమ గొల్చు రతీశ్వరుని గూర్చి ఆశుధారగా ఎవరు చక్కని కవిత్వము చెప్పగలరో వారికి సన్మానముతోపాటు మరుసటి కాముని పున్నమవరకు ఆతడు ఇల్లటపు వల్లభుడగునని చాటి చెప్పెను. రామరాజభూషణు డంతట తిలోత్తమను ఆశువుగా పొగడెను. దానికి గిరీశము ఈసడించెను; కాని తిలోత్తమ మెచ్చి తాంబూల మిచ్చెను. పండితరాయలు ఆ పద్యములు సోమన వసంతవిలాసములోనివి కాని స్వీయములు కావని వాదించి చదివి వినిపించెను. అందఱును ఆశ్చర్యపడిరి. తిలోత్తమ 'రివాజు' ప్రకారము అతనికి దక్కెను. అప్పుడు 'నాపెయు నాతడు నమ్మనోమహోయతనునిదైన గర్భగుడియా పడుకింటను దారసిల్లి రచ్చతురుని చూడ్కి పుష్పము గచానయెడంద నివేదనంబుగన్' (20 ప) అనియు '...ఏకృతిరచించె నేని తా నేకతమున, నంతరంగజ సాంగత్య సాక్షికముగ, నద్వి భామాకృతికి బహిరంగమగును నైకముఖ నవ్యరస జగన్నాథుండతండు' (21 ప) అనియు,

'పడుకింటి కేగునప్పుడు ప్రౌఢపండిత
శ్లాఘ్య మలంకారశాస్త్ర మామె
పాన్పుపై నున్నప్డు పరమానుభవపుర
స్కారహితము స్మరశాస్త్ర మామె
నిదురలో నున్నప్డు మదన బుద్ధోత్తమ
సదుపజ్ఞ మగుస్వప్నశాస్త్ర మామె
రతికేళికా మందిరమ్ము వెడలు నప్డు
సత్యాఖ్య మగుశబ్దశాస్త్రమామె
అతనికౌగిళ్ళు కబ్బములైన నామె
చూపునను డీక చిరునవ్వు చొప్పునునుతి
సలుపు, శైలివలె నొకప్డు జాఱిపోవు
కావ్యమున ధ్వనివంటిది కాంత సిగ్గు'
(22 ప)

అనియు కవి వర్ణించుటలో తిలోత్తమా జగన్నాథుల పరిణామ శృంగారమును స్పష్టపరచినాడు.

కొన్నాళ్ళకు గిరీశము తిలోత్తమతో భట్టుమూర్తి స్వీయపద్యములను ఏకసంధాగ్రాహి యగు జగన్నాథుడు పఠించి మోస పుచ్చెను గాన అతనిని విడిచిపెట్టి ఆంగ్లకవితలో షేక్స్పియరంతటి వాడగు తన్ను చేపట్ట వలసిన దని అర్థించెను. కాని దాని కామె తిరస్కరించెను. గిరీశము కోపగించి నారదుని మూలమున ఫిర్యాదు చేయగా ఇంద్రుడు 'బృందారక వారకాంత నిరత మ్మనపాయినిగాక పండితాగ్రారికి బంధనాలయ నివాసము దండనగా విధించె' పండితరాయలు దానికి సంతోషించెను. గిరీశము భట్టుమూర్తికీవిషయము తెలుపగా అత డింద్రునికడకేగి తప్పు పండితరాయలది గాని తిలోత్తమది కా దని వాదించెను. దానికి ఇంద్రుడు సమ్మతించి ఆతడు వ్రాసిన ఆరు పద్యముల కారు పున్నమలు తిలోత్తమ సుఖ మిమ్మ న గ్గాజ్ఞాపించెను. అప్పుడు తిలోత్తమ దక్కినభట్టుమూర్తి 'రామకను రాజభూషణమై మెలఁగి' సార్థకబిరుదాంకితు డయ్యెను.

ఉద్యోగవిజయము :- తిరుపతి వేంకట కవులు తాముచదివిన కామశాస్త్రమును సార్థకముఁజేసికొన నెంచి స్వర్గమున దిరుగాడుచుండగా ధూర్జటి వారికచ్చటతగినవనిత మంజుఘోష అని తెలిపెను. వారామెను కలసికొనగా' ఆకవిబ్రహ్మలసముజ్జ్వలానుభవపు, టూపిరిని బోసికొని కాంత రూపుగొన్న నవ్యశృంగార కావ్యం బనంగ నొప్పె'ను. ఆ సందర్భమున కవి.

'ఒక్క ప్రమిదలోన ద్యోతితమ్ములు వారు
దివ్వెలు వారు, దీధితి పడంతి
ఒక సరోవరమున నొదవిన రెండు కెం
దామరల్ వారు, నెత్తావి యువిద
ఒకయొఱలోపల నొదిగిపోయిన రెండు
ఛురికలువారు, వాదర లతాంగి
ఒకగూటినుండి గొంతుకలువిప్పిన రెండు
కలరవాల్ వారు, కాకలి నెలంత
మనసిజబ్రహ్మమంత్రమ్ము మంజుమణిత
మును బునశ్చరణ మొనర్పఁ దనరెవారి
కొక్కగానొక్కజీవాత్మయొక్క రెండు
భౌతికప్రతీకలను నద్వైతసిద్ధి' (13ప)

అని వర్ణించి కవు లిరువురకు గలిగిన అద్వైతతత్త్వమును తెలిపినాడు.

పదివత్సరా లిట్లు గడిచిన వెనుక రావణుని సంతతివా డొకడు వచ్చి మంజు ఘోష నెత్తికొని పోయెను. కవులు చేయునది లేక విజయరాఘవుని నాశ్రయించిరి. అతడామెను విడివిపించి తన బాహుపంజరమున బంధించెను. కవులప్పుడు రంగాజమ్మ నాశ్రయించిరి. కాని దాని వలన లాభము లేదనియు శచీశుడాతని కొఱకు ఉంచిన పుంజికస్థలను పొగిడి వశపరచు కొనుడనియు నారదుడు తెలుపగా, వారట్లే చేసిరి. విజయుడది విని మంజు'ను విడిచి పుచ్చెను. కాని 'పుంజు' రాలేదు. దానితో విజయుడు 'రెంటికిం జెడినట్టి రేవ డయ్యె'ను.

అప్పుడు 'సారసాక్షు లిద్వ రను సీసాలవెనుక తేటగీతముకై వడి నాట్ల వెలది పొల్కి కవులతో జేయు కాపురమునందు కైపుమీరి' కంతుడు కాముడు డయినాడట!

కృష్ణార్పణము :- క్షేత్రయ్య రూపము, కవిత్వముచూచి ఘృతాచిగుండె కరిగెను. ఆమె వచ్చి అతని పూజలో పాల్గొనసాగెను. "నీవును కృష్ణభక్తవ" అని అతడడుగగా "వెన్నపదనైన యెదయున్న కెట్టిరెవరు కారు ప్రద్యుమ్నసఖు'లని ఆమె జవాబిచ్చెను. ఆమె

యాతని వశపరచుకొనుటకు సర్వయత్నములు చేసెను కాని అతడు చపలుడు గాక సర్వము శౌరికి నర్పణ మనెను. ఆమె 'పట్టుపావడన్ జాతిచి యూరువుంగటిని చయ్యన బయ్యెద జార్చి సాంద్రవక్షోరుహముల్ బయల్పఱచ' గా క్షేత్రయ్య 'గదాయుధ, చక్రపద్మముల్' తలంచెను. ఆమె 'కందర్పుని కంటువలను' కన్పడజేయగా క్షేత్రయ్య సర్వాంతర్యామియగు కృష్ణుని తలంచెను. నిద్రలో మునిగి ఒకనాడామె సర్వాంగములు కన్పడజేయగా అతనికి 'క్షీరాంబుధి శేషతల్పము పయిన్ జెన్నొందు శ్రీనాథునిం బలె' దోచెను. మహావేశముతో ఆమె నాతడు కౌగలించెను. కౌగిలికి లోగిన కాంతయొడల్ విపంచియై మ్రోగె, తదీయాంగములు భోగములొప్పెను రాసలీలలై' (ప 14) అని కవి వర్ణించినాడిక్కడ.

అతనిని వలపింప నెంచివచ్చిన ఆమెకు అతడే హరిగా దోచి సర్వము ధారపోసెను. ఒకనాటి వేకువ ఆమెకు నిద్రలో గంగానదీ తరంగములలో వేణుగాన ధ్వని వినబడి లేచి గోపికవిధమున వెదకుచు ఒకచోట హరిమందిరము గాంచెను. అక్కడామెకు జయదేవ స్వామి కనిపించెను. ఆమె కాతడు 'భక్తవరుడ కాడు రెండవ భగవంతుడు'గా దోచెను. సాక్షాత్కృష్ణుడని యెంచి ఆమె అతనిని కౌగిలించెను. అతడామె గోపిక యని కౌగిట చేర్చెను. ఈవిధముగా 'హరిభక్తుండని వరదుని స్థిరమతి హరియే యని జయదేవుని' ఆమె వలచుటలో ఆ హరిభక్తులిరువురు హరిని మరచిరి. దానిలో వారికి గుణపాఠము నేర్ప సమకట్టి హరి ఘృతాచిని హరించెను. అప్పుడు భావుకజనపట్టభద్రులైన కవులిద్దరు 'హరిపాదములే పదమ్ములై క్రకచ రదానురాగములె రాగములై విలపించిరి. వారిద్దరి ప్రార్థనలో తాత్త్వికదృష్టి గలదు.

ఉపరతి వేళ నుగ్మలి యొ
క్కొక్కపుడూర్జితమత్స్యమై మరొ
క్కపుడటు జంగ సాచి గురు
కచ్ఛపమై యిక నొక్కయూపు నే
రుపున గిరీంద్రమై తొడల
త్రోపున మించి నృసింహమై హరా
త్రిప మరుగుజ్జు తీరయి ప
దంపడి రామత విక్రమించెడిన్' (39)

'మగువ కుచంబులు పట్టిన
నగధరులము, ఘనజ, ఘనము
నాచికొనంగన్
అగుదుము చక్రధరుల మొక
పగదిగ మొలనూల్ మెడబడ
వనమాలులమున్' (41 ప)

ఇత్యాదు లిందు కుదాహరణములు.

ఘృతాచిని తెచ్చి ఈయనిచో హరిముందే ప్రాణములు వుత్తుమని వారు వేడగా ఘృతాచి కనబడెను. వారిద్దరామెను కౌగలించిరి. ఆకౌగిలిలో 'లీలా మహోజ్జ్వల గోపాలక బాలరూపము దిదృక్షైశ్చర్య దీపంబుగా' అంతట నంతరంగపు గవాక్షము లక్షులు విచ్చి యప్సరఃకాంత మురారిమూర్తియై యెసంగెను' ఆ మాయలోపడి కొట్టుమిట్టాడుచున్న వారి కింతలో

'కలకల నవ్వుచున్న హరి
కౌగిట నూగిసలాడు వారికిన్
గలగలలాడె చేతులను
గాజు, లురమ్ముల నుబ్బెగబ్బి గు
బ్బలు, బలుసిబ్బితుల్ వొడమె
పట్టుపుడల్చు కొనన్ బెనంగువా
రల హరి యక్కునం బొదివె
రాధిక నేలిన రాసలీలలన్ (51 ప)

ఈపద్యములను బట్టి ఈ ఘట్టమున రాధామాధవ భక్తి నిరూపింపబడినది.

వైజయంతి :– వైజయంతీపురము సర్వసుఖములకు నిలయము. ఇచ్చట 'భౌమజనులకు బోలె బంధములు లేవు. అపవర్గవాంఛ లేదు. 'యాతనలు బాధ్యతలు సమస్యలు లేవు. వ్యక్తులకు మధ్య తారతమ్యములు లేవు. సర్వోపపన్న సుఖమొక్కటే' అక్కడున్నది. 'కళలకు రసజ్ఞతలకిది కాణయాచి ప్రత్యేకపునందిచ్చుట అందముండును. భావుకులకిచ్చట బ్రహ్మపట్టము సిద్ధించు'ను. ఈ పట్టణమునకు నాకసంజ్ఞ సార్థకము.

ఒకనాడింద్రుడు సభలో రాబోవు మరుని ఉత్సవము నాడు దేవవేశ్యలలో ఎన్నికగన్న దానికి 'స్మరవైజయంతి' బిరుదు నిత్తు ననెను. తెల్గురాయడు దానికి రంభతగు ననగా తిమ్మనార్యుడు మేనక తగిన దనెను. శ్రీనాథుడు 'శశి'ని చెప్పెను. బృహస్పతి అది తేల్చుటకొక సంఘము వేయుమనెను. అందరును పింగళిసూరన ఆ సంఘాధ్యక్షు డనిరి. చివరకందు చేమకూర, వెలదిండ్ల శేషము వెంకటేశ్వరులు సభ్యులైరి. వారు అనుమతిని గొని 'బోణీ' చేయుటకు రంభ యింటి కేగిరి. ఆమెను

'చూచి కుచాద్రి శృంగ నిభ
చూచుకగోచర చూత కాత నా
రాచ పరంపరా విస్మృమ
రస్పృహులై భ్రమరామహాస్సమ
స్తాచిత శ్రీగిరీంద్ర శిఖ
రాగ్రము జూచిన భక్తరాజులై
త్లేచినహర్ష మంది రమి
యింతురొ యట్లయి రా కవీశ్వరుల్' (25)

ఆమె దర్శనము శ్రీశైలసందర్శన మనుట విశేషము. అక్కడి చెలికత్తె తెలుపగా రంభ వచ్చి "నన్ను రచ్చకీడ్చి ఘనతను గొననెంచిన సూరనగారు మీరేనా" అని అడిగి ఆహ్వానించెను. అప్పుడు సూరన

'వినుత శృంగార దేవతా విశ్వరూప
దర్శనము చేసితిని కవిత్వమున; తత్ప్ర
శస్తదేవతా మంత్ర బీజాక్షర మవు
నిన్ను స్మరింయింపకయ యుందు నెట్టు
నేను" (37)

అని ఆమెను కొని యాడెను. ఆమె ఆతనిని పడకింటికి తీసికొని పోయెను.

రంభ అనగా అరటి. అది అన్నింటిని ఇచ్చుచునది. దాని విశిష్టతను గూర్చి తెల్పుచు కవి

'ఒకనికిఁ బూవుగావలె, మ
లొకనికి కక్కాయయౌను గాయ, వే
ఱొకరుడు పండుఁగోరు నిక
నొక్కడు చాలను విస్తరాకు వృ
త్తికమగు రంభనుండి; గణి
కాగణ కల్పకమైన రంభనుం
డికవిబు లేంద్రు లెల్లఁ దమి
నెల్లను గోరిరి పొంది రెల్లనున్. (43)

అని వర్ణించినాడు.

మొత్తం మీద వేశ్యాగృహములన్నియుచూచి నివేదికను ఇంద్రునకు కవులు సమర్పించిరి. దానిని బట్టి ఒకనాటి సభలో ఊర్వశికి ఇంద్రుడు బిరుదు నిచ్చి సన్మానించెను. మన్మథుడువచ్చి ఆమెతో పాటు అంతర్ధాన మయ్యెను. కాని వారెంతో దవ్వుల కేగలేదు 'రసవాహభూతరమ్యాత్మ లయ్యంతశ్చక్షువు విచ్చి చూచిననదే యవ్వారి శుద్ధాంతమౌ' (96) నని కవి వర్ణించుటలో వారిద్దరు క్రాంతదర్శికి కనఁబడగలరు అను విషయము స్పష్టము.

నూరన కడకేగి ఆ అచ్చరతో మాకెట్లు సంపర్కము కలుగునో తెలుపుడని నిగమశర్మాదు లడుగగా 'మీబోటి పాత్ర లెందఱో ధరలో గలరు, శ్రీనాథాది కవుల కృతులలో పాత్రలగుటచే మీకింత కీర్తి గల్గెను. మేమందఱము నాకమందు పొందిన యను భవములు మిక్కిలి విశిష్ట మైనవి. ఆయను భూతుల నన్నింటి నేర్చి కూర్చి 'ప్రసన్న కుసుమాయుధ' మను కావ్యరాజమును రచించితిని. భువికేగి దానిని ప్రచారము చేయుటకవకాశమును లేదు. కావున మీరు ఆ పుణ్యము గట్టుకొనుడు.

'పతలిఁ జచ్చి స్వర్గస్థు లగుదురో లేదో బ్రదికి యుండి స్వర్గతులు కావలతు లేని పరమభావుక లగుచుఁ జేపట్టుఁ డింక కావ్యములను శృంగార భృంగారువులను' (103)

అని అనుటలో కావ్యవిశిష్టత కొనియాడ బడినది.

'సరస మనోమనోజపరి
పద్భవనంపు గవాక్షముల్ మనో
హరతను వల్లిఁబూచినల
తాంతములందవుఁ గందువల్ సరా
సరిగుఱుతించు ఖంజనులు
చానవిలోచనముల్ రసజ్ఞతల్
విరిసిన జాడనీకృతిని
విప్పినఁ జాలు ప్రసన్న మయ్యెడున్.'

అని ఈ కావ్యవిశేషములను వర్ణించుట జరిగినది. ఇదే సందర్భమున

'ఈనినాదముల్ గావు సాహిత్యమనగ
శ్రావ్యమైన శబ్దమ్మున రమ్యమైన
యర్థమును హృద్యమైనట్టి యనుభవముగ
మలచునదియె పో సాహిత్యమహిమ
కనఁగ.' (109)

అని సాహిత్యమనగా నేమియో తెల్పబడినది.

అందరికి అందుబాటులో ఆనంద ముండును. ఎట్లును బ్రహ్మానంద మందదు. కావున కావ్యములో రసానందమును పొందవచ్చును. ఈ సందర్భములో –

'కావ్యకళారసజ్ఞతవి
కాసము బొందెనయేని మానవుం
డవ్యయమైనహ్లాద మెద
సాక్షిగఁబొందుట మాత్రగాదు స
ర్వ వ్యసనాత్మపాశవము
బాయును దైవముతోడి భవ్యబాం
ధవ్య మెసంగి తానయొక
దైవముగున్ తనతోడివారికిన్.' (113ప)

(తరువాయి 7 వ పేజీలో)

# వేడికోలు

- శ్రీ యస్. వి. రంగనాథస్వామి

పాటల గంధి నీవు నను
బాధలు బెట్టుట పాడిగాదు నీ
మాటలతీరు చూడగను
మారుని బాధకు దాశ లేని న
న్నాటలలోన బెట్టియును
నాటకమాడుచు నుంటి వీవికన్
మాటలు గట్టిపెట్టి నను
మక్కువ తోడుత నాదరింపవే.

చల్లనిగుండె నీది యని
జాగులు జేసిన నూరకొంటి వీ
చల్లని వింతమాటలకు
సంబర మందియు నిన్నునమ్మితిన్
కల్లలుగావు నమ్ము మిక
కాలముపోయిన రాదు రా దికన్
చల్లనిమాట లాపి యిక
సంతస మొప్పగ చెంతఁజేరవే.

మాటకు మాట చెప్పెదవు
మంచిగ సాకులు సెప్పి నే డికన్
ఆటలలోన బెట్టియును
నాసలు చూపుదు వంతెకానినీ
మాటలలోని సత్యమది
మచ్చునకైనను గానరాదికన్
మాటలు గట్టిపెట్టి యిక
మన్మథపూజకు రమ్ము వేగమే.

రమ్మని వేడుకొంటి నిను రాణిగ జేసె
దనంచు, బల్కినే
పొమ్మన లేదు నిన్నెపుడుఁ
బూజలు చేసితి నీదురాకకై
ఘుమ్మని పూలవాసనలు
గ్రుమ్మగ వచ్చితి నిన్ను జూచితిన్
కమ్మని కౌగిలింతలకు
గాసిల జేసెదు న్యాయమా సఖీ!

కల్లలుగాదు నమ్ము పర
కాంతలు వేవురు వచ్చి చేర నే
నొల్లనుగాక యొల్ల నెపు
డో చెలి నీదగు ముద్దుమోమికన్

జల్లెను పూలవానలను
  చల్లగ నామది సంతసింపగన్
వెల్లువ చేరర మ్మికను
  వేడుక తీరగ నాదరింపవే.

భామ నన్నిటు బాధింప భావ్య మగునె
మగువ యెరుగవె మారుని మంత్రశక్తి
మాట మన్నించి రాగదే మగువమిన్న
తరుణి గడచిన నిమిషమ్ము తాళఁజాల.

ఎంతని వేడుచు నుందును
కంతుని మొరవినగలేద కాంతరో నీవున్
వింతగ జూచెద వేలనె
సంతసమొప్పగ నురమ్ము సరసత తెలియన్.

---

( 6 వ పేజీ తరువాయి )

అని కావ్యరసానంద విశిష్టతను కవి తెల్పినాడు.

ఈవిధముగా కావ్యమున కథలన్నియు డా॥ యస్వీ జోగారావుగారు చేసిన ఊహలనుండి ఉద్భవించినను, క్రాంతదర్శియయిన ప్రతికవియు బాహ్యమున కొక శృంగార రసాంబుధిలో నోలలాడు సామాన్య జీవివలె కన్పడి అంతర్యమున ఒకదివ్యతత్త్వమునారాధించు పరమ భాగవతోత్తముడుగా నింకు దర్శనమిచ్చుట ముఖ్యవిశేషము. భావమున కామియయిన ప్రతి కవీశ్వరుడును స్వభావమున మోక్షగామి అని నిరూపించుటయే కవి ముఖ్యోద్దేశముగా ఈ కావ్యమున కనిపించును. సౌందర్యోపాసకుడుగా మాత్రమే సంఘపు సంకుచిత దృష్టిలో కనిపించు ద్రష్ట, స్రష్ట అయిన కవి నిజమునకు తన కళోపాసనద్వారా ఆ పరతత్త్వము నుపాసించుచున్నా డని తెలియ జేయుటయే ప్రసన్న కుసుమాయుధ కావ్య పరమావధి. లౌకికజగత్తులోని అపూర్ణ వాస్తవికతకు పూర్ణత ప్రసాదించిన కవి కల్పన కొక మచ్చుతునక ఈకావ్యం. *

డా॥ నారపరాజు శ్రీధరరాయకవి
(M.B B.S. D.T.M. [illegible])
1989

# బ్రతుకు లో[illegible]ణము

కవికోకిల శ్రీ మామిండ్ల రామగౌడు

బ్రతుకు సంద్రపు లోతులందున
వెతల గుట్టల వెన్ని మూగెనో
గుండె కొండలలోన నెగిరెడు
కోర్కెపిట్టల వెన్ని యీగెనో.

కడలి కడుపున తలలుదూర్చిన
బడుగు మమతల జాడలేవీ?
పుడమి యొడిలో నొడలుచేర్చిన
గడుసు మోహపు కోడె లేవీ?

కటిక చీకటి దారులందున
కాములగు "సరదారు, లేగిరి
కంటి పాపల పొరల తెరలో
మింటినలుపుల చెలులు మూగిరి.

గతము గడ్డిగ నెమరు వేయుచు
సతము గ్రుడ్డిగ చేలలోబడి
బ్రతుకు బండిని లాగజాలని
బక్క యెద్దు విధానఁ గూలితి.

కలిమి జాతర కొల్లబోయెను
తెలివి రాతిరి తెల్లవారెను
మదపు టేన్గుల బట్టి చీల్చెడు
ముదిమి మకరము వచ్చిచేరెను.

పూవు వాడిన తరుణమందున
తావితావున నిల్చియుండునె
దీపమారిన క్షణమునందున
దివ్య తేజము కానిపించునె.

కోతిరీతిగ మనము వనమున
కొమ్మపైనను దూకి దూకియు
గిరుల నెక్కియు పేర్మి తేనెలు
మరులు గొల్పగ నాకి నాకియు-

భవసముద్రములో మునిగియును
భవపు రత్నా లేరుకొంటిని
భవునివలె దుఃఖ స్రవంతిని
భార మనకయె తల ధరించితి.

శోకవిష భాండముల నీ నర
లోకమందున నిల్పవల దని
గుండె చెఱువున నింపుకొంటిని
నిండు బరువున నిక్కచుంటిని.

చుక్కలన్నియు
చుక్కలై నను వెక్కిరించెను
సుందరమ్మగు ముఖపు కలువయె
చందురునిలో నిక్కపొంచెను.

నవ్వులన్నియు పువ్వులాయెను
దివ్వెవెల్గులు మాయమాయెను
జవ్వనము రిపురివ్వ మంచును
గువ్వయై వినువీథిపోయెను.

కాలసర్పము నీడలోకం
కాళమై తిరుగాడు కప్పను
బోలె బాధలమ్రింగుచుంటిక
రాళ విషవలయాల జిక్కితి

ఇది మహానాటకము దీనికి
నెప్పు డంతముగలదొ తెలియది
చెప్పు డారంభమ్ము జరిగెనొ
యెవ్వడెఱుగును దీని మర్మము.

ఆదిపురుషుం డెవ్వడో మతి
యంత్య పురుషుం డెవ్వడో యా
మూల పురుషుని జాడ తెలియక
మునులు వనమున మూల్గుచుందురు

యుగయుగమ్ముల నుండి జగమున
పగలు రేలను కాలచక్రము
తిరుగుచుండగ లోకమెల్లను
పెరుగుచుండెను తరుగుచుండెను,

కంటికగపడు దృశ్యములు నిట
కాలవాహినిలోన గలియును
కాలపురుషుని కౌగిటన్ లో
కాలు గరగియు నిదురజెందును.

కాలమున కెదురీత లీదుట
కల నిజమ్మని నమ్మినట్టుల
నద్దమందున వస్తుజాలము
లగపడున్ కనుకట్టురీతిని

విరులలో పరిమళము భాతిని
విత్తులో వృక్షమ్ములుండును
పటములో చిత్తరువు వోలెను
ఘటములో జీవనము లుండున

# మధ్యమాంబా గరీయసీ

— శ్రీ డా॥ అయ్యగారి నరసింహమూర్తి, ఎ. ఏ., పిహెచ్. డి.

'ప్రాకృతం కే న భుజ్యతే' యను రీతిగాఁ గొందఱు లోకమున కనని వినని యట్టి నిందలకు గుఱియగుదురు. కొందఱు మనిషు లతిచిత్రముగాఁ గొన్ని విషయము లను దారుమారు చేసి లోకమున వ్యాపింప చేయుదురు. అంధపరంపరా న్యాయముగఁ బ్రజలు పండితులుకూడ నావిషయమునే మార్పులేక చెప్పుచుం దురు. ఆవిధమగు నపప్రథకు గురియైన వారిలో ముఖ్యముగ ముమ్మందుగ నెన్న దగిన మగువ కైక. ఈమె ప్రకృతి సిద్ధ ముగ సరళము, కోమలము, స్నిగ్ధము నైన చిత్తప్రవృత్తి గలిగియు లోకమున భరింపరాని నిందలకు నెలవై యపకీర్తి కజ్జలవతియైనది.

ఈమె కేకయభూకాంతుని యనుంగు పుత్రిక. దశరథక్ష్మాకాంతుని ముప్పురు కాంతలలో నీమె యొకతె. ఆభిజాత్యము చేగాని, పుట్టిన-మెట్టినయిండ్ల నునికివలన గాని దోషము లేనిది, దశరథుని కత్యం తాను రక్త, బహిఃప్రాణముకూడ.

ఈమె దథవశాంగు డను మునివలన రాక్షసమాయలకు ప్రతీకారము చేయ నేర్చుకొనెను. దశరథు డొకపరి యింద్రు నితో శంబరాసురుని మీదకు యుద్ధము నకుఁ బోవుచు తన బహిఃప్రాణమగు కైకనుకూడ తోడ్కొనిపోయెను. కైక తన బొటనవ్రేలి నుంచి రథచక్రమును గాపాడెను. దశరథుడీ యుపకారమునకు ముదమంది ఆమెను రెండువరములను కోరుకొమ్మని యడుగ నామె తనకు వలయునపుడడిగెద నని బదులు చెప్పెను. దానికి రాజును వల్లె యనెను.

శ్రావణు డను నొక మునిబాలకుఁడు దప్పికచేఁ దల్లడిల్లుచున్న తన తలిదండ్రు లకు జలమును గొనితేవలె నని ఆలాబును గొని సమీపజలాశయమునకుఁ బోయి నీటిలో ముంచగా 'బుడబుడ' మను శబ్దము వచ్చెను. సరిగా నదేదినమున నాసమయముననే 'శబ్దవేధి' విద్య నభ్య సించిన దశరథుడు తన విద్యాపాటవమును బరీక్షింపఁ గోరిక కలవాడై 'బుడబుడ' మను శబ్దమును విని 'వనగజము'ను భ్రాం తిచే నొక బాణమును వేసెను. దురదృష్ట వశమున నాశరము ముని బాలునకుఁ దగు లఁగా నాతఁడు రోదించుచుఁ బ్రాణము లను వీడెను.

రోదనా పథమునుబట్టి దశరథుడు పోయి అట వనగజమునకు బదులు ముని బాలకుని గాంచి తల్లడిల్లి "సాముగరి డీలు నేర్చి మూలనున్న ముసలమ్మ"ను గొట్టినట్లు తానేర్చిన విద్యయొక ముని బాలకుని ప్రాణములుతీయుట కక్కరకు వచ్చెనుగదాయని దురపిల్లుచు నిజవృత్తాం తమును తెలిపి, విగత జీవుడైన యాబా లుని తన భుజస్కంధములపై నిడుకొని మునిదంపతులకడ కరిగి జరిగిన వృత్తాంత మును దెలుపఁగా వారు పుత్రవియోగ సంజనిత శోక సంతప్త హృదయులై ముందు వెనుక లాలోచింపక 'మావలెనే నీవును పుత్రవియోగ దుఃఖము ననుభ వింతువుగాక' యని శాపమిచ్చి వారును దివంగతులైరి. చతుస్సముద్ర ముద్రిత భూమండలము నేలు భూజానియైననేమి? చేసినకృత్యమునకు ఫల మనుభవింపక తీరదుగదా! ముని శాపమున కెదురు లేదు. కనుక నిక చేయునది లేక పుట్టెడు దుఃఖ ముతో గృహోన్ముఖుడైనాడురాజు.

దశరథుడు కౌశల్యా, కైకేయీ, సుమిత్రలను వివాహమాడి చాలకాల మయినదిగాని యేయొక్కరి యందును నింటికి దీపమ్మగు సంతానము మాత్రము కలుగ కుండెను.

దశరథుఁడు తాను సకలభోగ సంప న్నుడైనను సదనమ్మునకు దీపమ్మగు సం తానము లేకపోవుటచే వసిష్ఠుని యాజ్ఞ గైకొని పుత్రకామేష్టి యొనరించెను. అం తట యజ్ఞపురుషుఁ డరుదెంచి దశరథున కొక పాయసపాత్ర నందించెను. ఆతడా పాయసములో నర్ధభాగమును కౌసల్య కిచ్చినపుడుగాని, అర్ధభాగమును సుమిత్ర కిచ్చుటయేగాక మఱియొక అర్ధభాగ మును కూడ నామెకే యిచ్చినపుడుగాని కైక యెంతమాత్రము అడ్డము చెప్పుట గాని, ఆగ్రహము చెందుటగాని చేయ లేదు.

కౌసల్యాయై నరపతిః
పాయసార్ధం దదౌతదా!
అర్ధాదర్ధం దదౌచాపి
సుమిత్రాయై నరాధిపః!
కైకేయ్యైచావశిష్టార్ధం
తదౌపుత్రార్థ కారణాత్ !
ప్రదదౌచావ శిష్టార్ధం
పాయసస్యామృతోపమమ్!

---

శుక్తిగర్భములోన నుండెడు
మౌక్తికమ్మున కెటుల గలిగెను
రత్నమై యలరారు భాగ్యము
రాదురా! యందఱికి మోక్షము
నీటిబుడగలు నరుల బ్రతుకులు
నింగి నెగిరెడు గాలిపడగలు
విశ్వమెల్ల మహేంద్రజాల మ
శాశ్వత మ్మని తెలియ జాలము.
బ్రతుకు పొలమున మేల్మిబంగరు
పంటలను పండించుకొనవలె
బ్రతుకు తోటలలోన మల్లెల
బాటలను వేయించుకొనవలె.

బ్రతుకు నొక శిల్పముగ మలచియు
భావిజనులకు కానుక నిడవలె
బ్రతుకులోతులలోన నితరులు
రతనముల జతెపఱచుకొనవలె.

( ఆకాశవాణి హైదరాబాదువారి సౌజన్యముతో )

అనుచింత్య సుమిత్రాయై
పునరేవ మహామతిః
ఏవం తాసాం దదౌ రాజా
భార్యాణాం పాయసం పృథక్ ॥

శ్రీరామచంద్రమూర్తిని పట్టాభిషిక్తుని చేయుటకై వృద్ధరాజు నిశ్చయింపగా వసిష్ఠాది మహర్షులు ముహూర్తము నిశ్చయించిరి. పత్తనమంతయు నెటు చూచినను నయనానంద కరముగ నున్నది. ఏదెస పరికించినను గోలాహలమే. మఱునాడే పట్టాభిషేక మహోత్సవము.

ఈపట్టాభిషేక మహోత్సవమునకు ముందు రామునితో దశరథుని సంభాషణము.

విప్రోషితశ్చ భరతో
యావదేవ పురాదితః
తావదేవాభిషేకస్తే
ప్రాప్తకాలో మతో మమ ॥
(అయోధ్య 1-25)

దూరదేశమునకుఁ బోయియున్న భరతుడీ పట్టణమున కెంతవఱకు రాకుండునో యంతవఱకే ఈ అభిషేకమునకుఁ దగిన కాలమని నాకు తోచుచున్నది.

కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతః స్థితః జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః (అయోధ్య 4-26)

నీతమ్ముడగు భరతుడు మిక్కిలి సజ్జనుల యాచారమునందున్నవాడే. అన్నయగు నిన్నను సరించువాడే. ధర్మబుద్ధి గలవాడే. దయగలవాడే. జితేంద్రియుడే. ఇందేమియు సందియములేదు.

కింతు చిత్తం మనుష్యాణాం, అనిత్యమితి మే మతిః సతాం తు ధర్మనిత్యానాం కృతశోభి చ రాఘవ॥ (అయోధ్య 4-27)

అట్లయినను మనుష్యుల చిత్తము చంచలం బని నాసిద్ధాంతము. కొంచెమైనను ధర్మము తప్పని పెద్దలు మాత్రమే తమకుఁ జేసిన యుపకారమును తలంతురుకాని యెంత మాత్రము భేదము నొందరు.

ఉత్తరార్ధము: కొంచెమైనను ధర్మము తప్పని పెద్దలనుగూడ మిక్కిలి చేయఁబడుదానికి సంతోషింతురు. కాని చేయఁబోవు దానికి సమ్మతింపరు. ఇపుడు నీకభిషేకంబు జరిగెనేని భరతునకుంగూడ రాజ్యమునం దాసకలుగును.

ఈ భాషణములనుబట్టి దశరథునకు భరతుని విషయమున నొకవిధమైన భీతి గలదని తెలియుచున్నది.

ఇది యిటు లుండ భరతుని పట్టాభిషేకమును గూర్చి మంథర కైకకు చేయు బోధలును దశరథుని చిత్తవృత్తి కనుగుణముగనే యున్నవి. 'యద్భావం తద్భవతి' యనునట్లు ధశరథుని దురాలోచనమునకు మంథర దూరాలోచనము ఎంత చిత్రము. అదృష్టమవిన ఇదియే కాబోలు.

సిరితావచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలముభంగిన్
సిరితాపోయిన పోవును
కరిమ్రింగిన వెలగపండుకరణిని సుమతీ
అనిగదా సూక్తి.

అపవాహ్య స దుష్టాత్మా భరతం తవ బంధుషు కాల్యే స్థాపయితా రామం రాజ్యే నిహతకంటకే॥ (7-24)

దుష్టాత్ముడగు నాదశరథుడు నీపుట్టినింటికి భరతుని పారఁద్రోలి యతడులేని సమయంబుఁ జూచి రేపు ప్రాతఃకాలంబున నెంతమాత్రమును శత్రువులు లేకుండుటం జేసి బహుసుఖప్రదంబయిన రాజ్యంబునందు రామునకుఁ బట్టాభిషేకము చేయఁబోవుచున్నాడు.

దశరథుని కుటిలాత్మను గ్రహించి దానిచేఁ గీడును శంకించినదై దూరాలోచన చేసిన మంథర కైకమనసు మార్చుటకు యత్నించి సఫలీకృతురాలైనపుడు మంథరను దోషిణిగాఁ దలంచుట యుక్తమేమో ఒకపరియోచింపుఁడు. ఆపద రానున్నపుడు తన్నివారణకై యత్నించుట దోషముకాదుగదా!

అసలీ పట్టాభిషేక మహోత్సవ విషయము కౌసల్యా సుమిత్రలకుఁ దెలిసినదే కాని కైకకు తెలిసినట్లు లేదు.

అనిష్టే సుభగాకారే సౌభాగ్యేన వికత్థసే చలం హి తవ సౌభాగ్యం నద్యాః స్రోత ఇవోష్ణగే (7-15)

ఎండాకాలమునం దేటిప్రవాహమువలె నీ సౌభాగ్యమంతయు నాశము నొందుచున్నది.

ఈమంథర పలుకులకు కైక కుపిత యగుచు నిట్లు పలుకుచున్నది. కైకేయీ త్వబ్రవీత్ కుబ్జాం కచ్చిత్ క్షేమం న మంథరే విషణ్ణవదనాం హి త్వాం లక్షయే భృశదుఃఖితామ్ (7-17)

మంథరా! నీకు క్షేమంబు లేదా? యేమి? నీ మొగంబున దుఃఖచిహ్నములగపడుటచే నీవు మిగుల దుఃఖంబు నొందినావని తలంచుచున్నాను.

'ఇంకను నిద్రించుచున్నావేమి రాముడు పట్టాభిషిక్తుడగుచున్నాడు. మహాభయము నిన్నెదుర్కొనుచున్నదని మంథర చెప్పినపుడు కైక

అతీవ సా తు సంతుష్టా కైకేయీ విస్మయాన్వితా, ఏకమాభరణం తస్యై కుబ్జాయై ప్రదదౌ శుభమ్' (7-32)

ప్రియవార్త నందించిన యా ప్రమద మంథరకు నిజాభరణమును పారితోషికముగా నొసంగుటయే గాక

ఇదం తు మంథరే మహ్యమాఖ్యాసి పరమం ప్రియమ్ ఏతన్మే ప్రియమాఖ్యాతుః కిం వా భూయః కరోమి తే; రామే వా భరతే వాహం విశేషం నోపలక్షయే తస్మాత్తుష్టాఽస్మి యద్రాజా రామం రాజ్యేఽభిషేక్ష్యతి. (7-34,35)

మంథరా! ఈప్రియవార్త నందించిన నీకు మరల నేమి ప్రియ మొనర్పవలెనో తెల్పుము. రాముడును భరతుడును ఒకటియే. వారియందు నాకు భేదభావము లేదు. రాజు రాముని యువరాజుగాఁ

జేయుట నాకెంతయు సంతుష్టిని కలుగఁ జేయుచున్నది.

న మే వరం కించి దితస్త్వయా పునః ప్రియం ప్రియార్హే సువచం వచః పరమ్, తథా హ్యవోచస్త్వ మతః ప్రియోత్తరం పరం వరం తే ప్రదదామి తం వృణు (7-36)

మంథరా! నీవు సంతోషమునకుం దగినదానవు. ఈ రామాభిషేక వార్త కన్నను ఇతరమైన యింతటి ప్రియ వార్తను నాకింక నీవు చెప్పలేవు. అట్టి ప్రియవార్తను నీవిపుడు చెప్పితివి, కావున నీకు నన్నిటికంటె హెచ్చుగా సంతోషంబు కలిగించువస్తువు నిచ్చెదను దానిని కోరుకొనుము.

వీనినింబట్టి రామునియెడ కైకకుం గల వాత్సల్యానురాగము లెట్టివో తెలియుట యేకాక ఆమెసారళ్య సౌశీల్యములు వ్యక్తము లగుచున్నవి. రాముడు సవతిబిడ్డ డను అభిప్రాయమే ఆమె కున్నట్లు కనబడదు.

అయినను మంథర యూరకొనలేదు. శ్రీరామపట్టాభిషేకమువలన నింకను నీక నర్థ పరంపర గలదని దురపిల్లు మంథరతో

ధర్మజ్ఞో గురుభిః దాంతః కృతజ్ఞః సత్యవాక్ శుచిః, రామో రాజ్ఞః సుతో జ్యేష్ఠో యౌవరాజ్య మతోఽర్హతి, భ్రాతౄన్ భృత్యాంశ్చ దీర్ఘాయుః పితృవత్ పాలయిష్యతి, సంతప్యసే కథం కుబ్జేశ్రుత్వా రామాభిషేచనమ్. (8-14)

ధర్మజ్ఞుఁడు, జితేంద్రియుడు, సత్యవచనుడు, శుచియు నగు శ్రీరాముడు జ్యేష్ఠుడగుటవలన నా ఆయుష్మంతుడే రాజ్యమున కర్హుడు. ఆదీర్ఘాయువు జనకుని వలెనే భ్రాతృ, భృత్యాదులను జక్కఁగాఁ బరిపాలించును. మంథరా! శ్రీరామ పట్టాభిషేక మనిన నీ కెందు కింత సంతాపము.

భరత శ్చాపి రామస్య ధ్రువం వర్ష శతాత్ పరమ్ పితృ పైతామహం రాజ్య మవాప్తా పురుషర్షభః (3-16)

రాముడు నూరేండ్లు రాజ్యము పాలించిన వెనుక పురుషశ్రేష్ఠుడగు భరతుడు పితృపైతామహం బగు రాజ్యము నొందఁ గలఁడు. ఇది నిశ్చయము.

సా త్వ మభ్యుదయే ప్రాప్తే వర్తమానే చ మంథరే భవిష్యతి చ కల్యాణి కిమర్థం పరితప్యసే (8-17)

మంథరా! ఇపుడు రామాభిషేక రూపం బగు మంగళంబు సమీపించి యున్నది. ఇక భరతాభిషేక రూప మంగళము రాగలదు. అట్లు మంగళ పరంపరలు కలుగుచుండగా నీ వేల దుఃఖించెదవు.

యథా మే భరతో మాన్య స్తథా భూయోఽపి రాఘవః కౌసల్యాతోఽతిరిక్తం చ సోఽను శుశ్రూషతే హి మామ్ రాజ్యం యది హి రామస్య భరతస్యాపి తత్తదా మన్యతే హి యథాత్మానం తథా భ్రాతౄం శ్చ రాఘవః (8-18,19)

రాముడు కౌసల్యకుఁ జేయు శుశ్రూషకంటె హెచ్చుగా నాకు శుశ్రూష చేయుచున్నాడు. కావుననే నేను భరతుని యం దెంత బహుమాన ముంచవలయునో అంతకన్న హెచ్చుగా రామునిపైని బహుమాన ముంచవలయును. రాముడు తన్నెట్లుచూచుకొనునో యట్లే భేదంబు లేక తమ్ములను జూచుకొనువాడు కావున రామునకు రాజ్యంబు వచ్చెనేని యపుడు భరతునకును రాజ్యంబు వచ్చినట్లే.

లోక మనుచున్నటు లామెకు ముద్దుల పట్టి శ్రీరామచంద్రునిపై ప్రేమయే లేనిచో అమృతంపు సోనలవంటి పలుకు లామె నోటినుండి వెలువడి యుండవు. సత్యాసత్యము లెఱుంగనిలోకము సకల గుణాభిరామ యగు నా రామపై మాయని మచ్చను దెచ్చి పెట్టినది.

కైక యీరీతిపలుకు లెన్ని చెప్పినను వినక మంథర యింకను నీవిధముగ పలుకుచున్నది. ఈమంథర వాక్యములు వెనుకటి దశరథుని వాక్యములకు ప్రోద్బలకముగా నున్నవి.

ఓ కైకమ్మా! యథార్థముగ నీయందు నీభర్త కత్యధికానురాగ మున్నచో రామ పట్టాభిషేకమును గూర్చి నీకు మాట మాత్రమైన చెప్పినాడా? పిన్నతనముననే భరతుని మాతుల గృహమున కెందుల కంపినాడు?

బాల ఏవ హి మాతుల్యం భరతో నాయిత స్త్వయా సన్నికర్షాచ్చ సౌహార్దం జాయతే స్థావరే ష్వపి (8-28)

భరతుడు చిన్నవాడుగా నున్నపుడే నీవతనిని మేనమామయింటికి పంపితివి. ఎల్లపుడును దగ్గరనుండుటవలన వృక్షాదులయందు గూడ చెలిమి హెచ్చుగా గలుగుచున్నది. అట్లుండ భరతునియందు దశరథునకుఁ ప్రేమకలుగునని చెప్పనేల? అట్టి ఉపాయంబును నీవు చెఱిపితివి.

ఇక దశరథుని గూర్చి కైకపై ఆతని కూరిమిని గూర్చి మంథర చెప్పిన పలుకులును సత్య సన్నిహితములు.

ధర్మవాదీ శఠో భర్తా శ్లక్ష్ణవాదీ చ దారుణః, శుద్ధభావేన జానీషే తేనైవ మతిసంధితా (7-24)

నీభర్తయగు దశరథుఁడు నోట ధర్మంబును జెప్పుచుండును. స్వభావమున రహస్యముగాఁ గీడుసేయు. పైకి బహు ప్రియంబుగా మాటలాడును. స్వభావంబున బహుక్రూరుఁడు. నీవు కపటంబులేని దానవు. కావున నభినయించువానిని సత్యంబుగా నమ్ముచున్నావు. నిన్నతడట్లు మోసపుచ్చుచున్నాడు.

ఇక రాముడు రాజ్యాభిషిక్తుడగుచో నీవు కౌసల్యకు దాసివి కావలసివచ్చును. అపుడు నీకు జరుగు ననాదరణ మింతింత యనరానిదిగా నుండును. వీనినుండి బయట పడుటకు నీభర్త నీకిదివరలో వాగ్దత్తము చేసిన వరములే తగిన పనికి వచ్చును. అందు మొదటిది భరతుని

రాజ్యాభిషిక్తునిగాఁ జేయుట, రెండవది రాము నడవులకుఁ బంపుట అను నీ రెండు వరముల నడుగుమని నిర్విరామముగా బోధించి కైకకుఁ దలకెక్కించినది కుబ్జ.

యథా హి రామః పృథివీ మవాప్స్యతి
ధ్రువం ప్రణష్టో భరతో భవిష్యతి అతో
హి సంచింతయ రాజ్యమాత్మజే పరస్య
చైవాద్య వివాస కారణమ్ (8-39)

రాము డెప్పుడు భూమికి రాజగునో యపుడే భరతుడు నాశంబు నొందును. కావున నీకొడుకు భరతునకు రాజ్యంబు వచ్చునట్లును రాముని పట్టణంబు వెడల గొట్టించునట్లును దగినయుక్తుల నాలోచింపుము.

కొట్టకొట్టగా పర్వతములైనను పిండియగునట్లు మంథరా వాక్యములు కైక హృదయముపై నౌషధమువలె పని చేసినవి. దాని కుపాయముగా మంథర ఈపలుకులు పలికినది.

తవ దేవాసురే యుద్ధే సహ రాజర్షిభిః
పతిః అగచ్ఛత్వా ముపాదాయ దేవ
రాజస్య సాహ్యాకృత్ (9-11)

దిశమాస్థాయవై దేవి దక్షిణాం దణ్డ
కాన్ ప్రతి, వైజయంత మితి ఖ్యాతం
పురం యత్ర తిమిధ్వజః (9-12)

రాణివగు కైకేయీ! పూర్వము దేవాసుర యుద్ధమునందు నీ పెనిమిటి దశరథుడు దేవేంద్రునకు సాహాయ్యము సేయుటకై తనక్రింది రాజులతోఁ గూడ నిన్ను పిలుచుకొని దక్షిణపు దిక్కునందు దండకారణ్యముచేరి యచట తిమిధ్వజుడగు శంబరాసురుని రాజధానియగు వైజయంతంబను బట్టణంబునకుఁ బోయెను. అక్కడనా యుద్ధంబున.

అపవాహ్య త్వయా దేవి! సంగ్రామా
న్నష్టచేతనః తత్రాపి విక్షత శ్శస్త్రైః
పతి స్తేరక్షిత స్త్వయా (9-16)

ఓ కైకేయీ! అపుడు సారథ్యంబు సేయుచున్న నీవట్లు యుద్ధంబున మూర్ఛిల్లియున్న నీ పెనిమిటి దశరథుని యుద్ధభూమిని విడిచి యవ్వలకుఁ గొనిపోయి శీతలోపచారంబులం దనిపి కాపాడితివి. నీవు కొనిపోయి యున్న ఆరహస్య స్థలంబునకుఁ గూడ నాయసురులువచ్చి దశరథుని నానావిధాయుధంబులఁ బ్రహరింపగా నీవప్పుడు కూడ మఱియొక చోటునకుఁ గొనిపోయి మఱల కాపాడితివి.

తుష్టేన తేన దత్తౌ తే ద్వౌ వరేశుభ
దర్శనే మంగళకరంబులగు కండ్లుగల
కైకేయీ! ఆదశరథుడు నీవు రెండు మార్లు చేసిన యుపకారంబునకు, సాహసంబునకు సంతసించి నీకు రెండు వరంబు లిచ్చెను. వాని నీతరుణంబున నుపయోగించుకొని రాఁబోవు నాపదలను బాపుకొనుము.

చతుర్దశ హి వర్షాణి రామే ప్రవాజితే
వనమ్ ప్రజా భాగవత స్నేహం స్థిరః
పుత్రో భవిష్యతి (9-21)

రాముడు పదునాలుగు సంవత్సరంబులు అడవిలో నుండునట్లు చేయుదువేని ఆకాలంబులో నీకొడుకు భరతునిపైఁ బ్రజలకు దృఢానురాగంబుగలిగి యాపై రాముడు వచ్చి రాజ్యంబునకై యెంత యత్నించినను అతని యత్నంబు సాగక భరతునకు రాజ్యంబు స్థిరంబుగా నుండును.

రామ ప్రవ్రాజనం చైవ దేవి యాచ
స్వ తం వరమ్ (9-32)

రాణివగు కైకేయీ! అట్లగుటం జేసి నీవు భరతాభిషేకము కోరినపుడు దానితోఁ గూడ విడువక రాము నడవికి పంపవలె ననియు దశరథునడిగి కొనుము.

లోకమున చెప్పుకొను నటుల కైక తొందరపాటున పదునాలుగు దినములనుటకు మారుగా పదునాలుగు వత్సరములనిన దని చెప్పుట సరికాదు. ఒకనికి

# సాహిత్య రమణీ !

శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు, ఎం.ఏ.



చలం చచ్చి చాన్నాళ్ళయింది.
శరీరంమాత్రమే మొన్న మొన్న
కాలిపోయింది.

ఆయనగారి నాయికలకు – గృహాలూ,
అభిమానులకు మైదానమూ మిగిలాయి
ఏమైతే నేం
పత్రికా పతివ్రతల కంటతడి కూడా
ఆరిపోయింది.

కాబట్టి ఓ సాహిత్య రమణీ
ఇకనైనా పవిటనిండుగా కప్పుకోఁ ఉమ్మా.

---

ఒకవిషయమై హక్కు కలుగవలెనన్నను, గడుపు పదిరెండేడులనుండి పదునాలుగేడుల కాలము కావలయును. ఆకారణమున నే పాండవులచే కౌరవులు పదుమూడేడులు అరణ్యాజ్ఞాత వాసములు చేయించిరి.

పైపలుకులు (మంథరవి) కైకపై బాగుగాఁ బని చేసినవి. కావున నే కైక

కుబ్జతోత్వ మేవ తు మమాఽర్థేషు నిత్య
యుక్తా హితైషిణీ నాహం సమవబుద్ధ్యే
యం కుబ్జే రాజ్ఞశ్చికీర్షితమ్' (9-39)

గూనిదానవగు మంథరా! నీవొకతెవే నాకార్యములయందుఁ జాల నాసక్తిగలదానవు. నీవులేక నేను మాత్రమే యయినచో నిపుడు దశరథ మహారాజు రామాభిషేకము చేసి నన్నుఁ జెఱుపఁ దలంచుటను దెలిసికొనలేను.

( సశేషం )

# శాకుంతలోత్తర రామచరితములు

– శ్రీమతి కుసుమ, ఎం.ఏ.

'కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు శకుంతలా'

శకుంతల కణ్వర్షిదుహిత యనుటకంటె కవికుల గురు కాళిదాసుని పుత్రిక – అనడం సమంజసం. నాటకములలో శకుంతల గొప్పదని పండితాభిప్రాయం. విద్వత్సూక్తి అట్టిదే. భవభూతి మహాశయవిరచిత ఉత్తరరామచరిత నాటకము సర్వలోక మనోరంజనము. అందుచేతనే "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే' అనిరి (తద్రచనచే భవభూతి విశిష్టుడైనాడు.) కాళిదాస, భవభూతులిర్వురును వాగర్థముల విలువ తెలిసినవారే! ఇర్వురును 'నానృషిఃకురుతేకావ్యమ్' అని తలపింప చేయకలిగినవారే! ఇర్వురును వాల్మీకి 'మధుమయఫణితిని' జీర్ణించుకొనినవారే! 'ఆకాశము ఆకాశమువలెనే ఉంటుంది. వారినాటకములు వారివివలెనే ఉంటాయి–" అంటే అతిశయోక్తి కాదు. వారికి సమస్తలోక ప్రఖ్యాతిని సముపార్జించిన 'శాకుంతల', ఉత్తరరామచరితము' లలో అనేకములైన పోలికలు కనబడతాయి. శ్రీ రామస్వామి శాస్త్రి గారు–కాళిదాసు చాల, suggetive, భవభూతి చాల expressive అనిరి.

శాకుంతలము నవరస రంజిత ధనుస్సు, ఉత్తరరామచరితము కరుణ రసప్రధాన నీలాకాశము. నాయకులు దుష్యంత, శ్రీరామచంద్రులు ధీరోదాత్తులు, గంభీరులు; ప్రజాపాలక రంజకులు, ధర్మరక్షా కంకణ బద్ధులు; దేవలోకాధిపతినే మెప్పించిన జగదేకవీరులు. దుష్యంతుడు దక్షిణ నాయకుడైతే (చాలమంది భార్యలు కలవాడు). శ్రీరాముడు ఏకపత్నీవ్రతాన్ని అవలంబించిన అనుకూల నాయకుడు. శకుంతలముగ్ధ; సీత, శకుంతల లిరువురూ పతివ్రతాశిరోమణులు. రెంటిలోనూ బాలకులు తల్లిదండ్రులను కలిపి, నాటకాంతముల నాటకాన్ని అంతటినీ 'జిగేల్' మని మెరిపించి, ప్రధాన సూత్రధారులు వారే అయ్యారు.

కథలో పోలికలను గమనించేముందు కథలను సంక్షిప్తంగా చెప్పుకొందాము. శాకుంతలంలో 'దుష్యంతుడు ధర్మారణ్యమునకు వేటకువచ్చి, 'అవ్యాజమనోహర వపుః' శకుంతలనుచూచి ప్రేమించెను. గాంధర్వవిధిని ఆమెను పెళ్ళాడి, అంగుళీయకాన్ని ఇచ్చి, రాజధానికి వెళ్ళాడు. పరధ్యానముగానున్న శకుంతల దుర్వాస శాపానికి గురి అవుతుంది. శాపతాడిత విస్మృతిగ తానుయాయియైన గుష్యంతుడు ఆమెను నిరాకరిస్తాడు. అంగుళీయక అభిజ్ఞానముచే ఆమె గుర్తుకువస్తుంది. చివరకు పుత్రుడు భరతుని, భార్యశకుంతలను మారీచాశ్రమంలో కలుస్తాడు.

ఉత్తర రామచరితములో జనాపవాదుకు తల్లడిల్లిన శ్రీరాముడు, సీతను అడవులకు పంపి, ఆమెను వదలి, తన విధ్యుక్తధర్మమును నిర్వహిస్తాడు. శంబూకవధానంతరం తిరిగివస్తూ, అశ్వమేధ యజ్ఞాశ్వాన్ని అడ్డగించిన లవుని, కుశుని, తర్వాత సీతను వాల్మీకాశ్రమంలో కలుస్తాడు.

ఈ రెండు కథలలో భార్యాభర్తల వియోగమే ప్రధానమైనఇరుసు అయినది. శకుంతలాదుష్యంతులను కలిపిన భరతకుమారుడు పంచవర్ష ప్రాయుడు. సీతారాముల సుపుత్రులు కుశలవులు ద్వాదశ వర్ష ప్రాయులు. సింహపు పళ్ళను లెక్కపెట్టిన ఘనుడు భరతుడు యాగాశ్వాన్ని నిలిపిన ఘనుడు లవుడు. బాలకులు అమోఘవీరులు.

ఇలా తల్లీతండ్రీ, పిల్లలమధ్య నడచిన రెండునాటకాలు 7 అంకాలను కలిగి ఉన్నవి. 'గ్రీవాభంగాభిరామమ్ ముహురనుపతతి స్యందనేదత్తదృష్టిః' అనే వర్ణన ననుసరించి, దుష్యంతుడు 'ప్రస్తావనా'–పద్ధతిలో రంగస్థలమును ప్రవేశించినాడు. భవభూతి– 'స్నేహాత్సభాజయితుమేత్య...' 'జనకుడు స్నేహమున రంజింపజేసి, ఉత్సవమున, విదేహకు వెళ్ళెను. అందుచే కలత్రబారిన దేవిని ఓదార్ప నరేంద్రుడు రాజగృహమునకు వెడలెను. 'అని సూత్రధారునిచే చెప్పించి, ప్రస్తావనతో శ్రీరామభద్రుని రంగప్రవేశము చేయించినాడు.

సన్నివేశములలో కూడా రెండింటికి అతి సన్నిహితత్వం ఉన్నది. దుష్యంతుని వైఖానసాదులు శకుంతలను కణ్వాదులు 'చక్రవర్తివంటి పుత్రుని గనుమని' ఆశీర్వదించారు. అష్టావక్రముని 'వీరప్రసవా భూయాః' వీరులగు పుత్రులు కలుగుదురు గాక!' అని ఆశీర్వదించాడు. వారి వాక్కులు ఫలించుట నిక్కువము. కనుకనే శ్రీరాముడు 'లౌకికానాం హి సాధూనా మర్థంవా గనువర్తతే, ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి॥' అన్నాడు. సామాన్యలౌకిక జనుల మాటలు అర్థాన్ని అనుసరించి మెలగుతాయికాని ఋషుల వాక్కునే అర్థంఅనుసరించి పరిగెత్తుతుంది. ఇది వాస్తవమే కదా! ఈ ఆశీస్సులు ఇట భావికథా సూచనా ప్రయోజనాన్ని కూడా సాధించాయి.

ఆ దంపతుల దాంపత్యం వనాలలోనే సాగింది. శకుంతలాదుష్యంతులు అరణ్యంలోనే తమ అనురాగాన్ని పంచుకున్నారు. ఉత్తరరామచరితమ్‌లో సీతారాములు రాజభవనంలో ఉన్నప్పటికీ లక్ష్మణుడు చూపిన చిత్రాల వ్యాజమున వారివనసీమనివాసఖేలనాదుల నేభవభూతి చిత్రించాడు. 'అలసలలిత ముగ్ధా... పరి

మృదితమృణాళీ దుర్బలాన్యంగకాని త్వమురసి మమకృత్వా యత్ర నిద్రామవాప్తా' మార్గఖేదంచే వాడినతన 'దండకారణ్య ప్రియసఖి'ని తన ఎదపైన నిద్రింపజేశాడు; 'స్వహస్త ధృతశాలవృంత ఆతపత్రము'తో ఎండ తగులనీయలేదట! ఈవిధంగా వారు చిత్రాలలో నాటి జీవితాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నారు. కాని విధివశాత్తు తనచేయినే తలదిండుగా ఇచ్చి అర్ధాంగిని నిదురపుచ్చిన మధుర సన్నివేశం ఎంతోసేపు నిలువలేదు. జనాపవాదు వచ్చినది. రాముడు సీతను కారడవుల విడువనంపినాడు. ఇది తప్పనిసరి అయినది. కాని శాకుంతలంలో రాజు శకుంతలను విస్మృతపథగామియై వదలినాడు. రెండిటికీ పర్యవసానం ఒకటే! దుర్భర వియోగ విప్రలంభం! దుష్యంతుడు గర్భవతియైన ముగ్ధను తిరస్కరించాడు. కఠోరగర్భాలసయైన జానకిని వెడలనడిపాడు రాఘువుడు...

రెండింటిలోనూ నాయకులు ధర్మరక్షాకంకణబద్ధులు; ప్రజానురంజక పాలకులు. మరణించిన సార్ధవాహుని ధనాన్ని స్వాధీనపరచుకొనుట కనుచరులు సలహాను ఇయ్యగా, రాజు ఒప్పుకొనలేదు. ఆ వర్తకుని ధనం అతని కుటుంబానికే చెందేటట్లు తీర్పుచెప్పి, న్యాయాన్ని చేకూర్చాడు దుష్యంతుడు. శ్రీరాముడు ద్విజుని మృతశిశువును బ్రదికించుటకై శూద్రముని శంబూకుని అనిష్టతతో వధిస్తాడు. అప్పుడు 'సీతావివాసనపటోః కరుణా కుత స్తే? రే హస్తదక్షిణ...' నిండు చూలాలిని అడవికి పంపిన నీకు కరుణఎక్కడిది? ఓ దక్షిణహస్తమా? అని విలవిలలాడతాడు.

అభిజ్ఞాన శాకుంతల, ఉత్తరరామచరితములలో వింతగొలిపే అతివిచిత్రమైన పోలిక ఏమిటంటే అది పుష్పకవిమానం-(రథం). ఇంద్రునివద్దనుండి తిరిగివస్తూ, సుందరప్రకృతి దృశ్యాకర్షితుడై, దుష్యంతుడు మారీచాశ్రమ ప్రాంతాలలో దిగుతాడు. శ్రీరామచంద్రుడు పుష్పకవిమానంలో బయలుదేరి, శంబూకుని వెదకుతాడు. తిరిగివస్తూ చంద్రకేతు లవుల యుద్ధాన్ని చూసి, వారిస్తూ విమానంనుండి దిగుతాడు.

(సశేషం)

# నూతలపాటి కవితావధూటి

(గతసంచిక తరువాయి)

— రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ.)



గంగాధరం వెన్నెలలాటి చల్లని గీతాల్ని పాడినా, వేసవిలాటి మండుతున్న ఎండలో తన గుండెలోనినదించిన, ప్రవహించిన, పరవళ్ళుతొక్కిన వలపు గీతాల్ని, అమృతపాతాన్ని మనకు 'నవనీతంలాంటి నవగీతాన్ని' అందిస్తాడు. "వేసవిలో వలపుగీతాన్ని" స్పందిస్తూ.

*పృథ్వీనాప్రేయసి
మలయమారుతం నాదూతిక అని

ప్రారంభించి మధ్యలో ఇలా అంటాడు.

"నేనునిజం నాదొక యిజం
నేను పృథ్విని ప్రేమిస్తున్నాను.
చెమటతీసి
చెమట ముత్యాలహారంవేసి."

ఆయన ఎవ్వరూచేయని, చేయబోని పనిచేసాడు. ఎవరైనా అందమైన వస్తువుల్ని ఆనందాన్ని కల్గించే ప్రకృతిని, పదార్థాన్ని ప్రేమిస్తారు తప్ప (మట్టిని) భూమిని ఎవరు ప్రేమిస్తారు? ఆయన భూమిని ప్రేమించడంలోనే ప్రత్యేకత ఉంది. ఒకడు ఆనందంగా ఉంటున్నాడంటే దానికి పరోక్షంగా కారణభూతమయ్యేది భూమేకదా! అన్నిసంపదలకు నిలయం రైతుబిడ్డ కావడంవల్ల భూమంటే ఎనలేని ప్రేమ, గౌరవం ఆయనకి- ఆభూమినుంచి వచ్చే ఫలితాన్ని, మర్చిపోలేదుకాబట్టి ఆయన దృష్టిలో సామాన్యుడే నేటి చక్రవర్తి. కష్టించేవారినే ఆయన గౌరవిస్తాడు. సౌందర్యానికి, సౌకుమార్యానికి ఆయన కవిత్వం పెట్టిందిపేరు. ఆయన కవితలో మానవతకు ప్రముఖస్థానం ప్రథమస్థానం ఉంది. ఆయన మానవతావాది, శ్రేయోభిలాషి, ఆశావాది, అభ్యుదయాన్వేషి.

"ఏడాదికోమాటు" వచ్చే ఉగాది కన్యనుచూసి ఏమంటాడో తెలుసా? ఎందుకొచ్చావని ప్రశ్నిస్తాడు? ఏమి తెచ్చావని ఎలుగెత్తి అడుగుతాడు. ఇల్లు మరిచి, ఒళ్ళుమరిచి, నీళ్ళూనిప్పూలూ మరిచి రాత్రింబవళ్ళు గనిమీద నిర్జీవంగా పడివున్న పేదకాపుగుండె సవ్వడి విన్నావా? అనేక గాథామయ, బాధామయ దృశ్యాల్ని చూస్తూ ఊరుకున్నావా? అసలు ఎలా వచ్చావు? వచ్చి చూసి వెళ్ళిపోవటమేనా, మంచిని, శాంతిని, తృప్తిని, ప్రసాదించి, ఆనందంలో ప్రజల్ని ఓలలాడించడం ఉందా? అని నిర్మొహమాటంగా, నిర్భయంగా, నిస్సందేహంగా అడిగేస్తాడు. మాకంటే హతాశయులూ, గతాశయులూ, చ్యుతభర్తృకలూ, మృతపుత్రకులూ, నీకు ఇంకా ఎక్కడైనా ఉన్నారా? మరిలేకపోతే. చూసీ చూడనట్టు, అంటీ అంటనట్టు, పట్టీపట్టనట్టు, వెళ్ళిపోతావేం? అని అడగదల్చుకున్న నాలుగు మాటలు అడిగి కడిగేస్తాడు, మళ్ళీ ఆవేశంలో ఏవోఅన్నానని, క్షమించమని కోరుకుంటాడు. మానవ సహజంకదూ. ఉగాది కన్యని ఒకటి కోరుతాడు.

*ఉగాదీ, చల్లగా వెళ్లు
ఇంక నీగమనాని కడ్డుపడం!
మాకంటె దీనుల్ని హీనుల్ని చల్లగా
చూడు
వాళ్ళ గుండెల్లో వెచ్చనిశాంతి
గీతంపాడు

దేశమంతా చల్లగా ఉంటేనే
మావ చల్లన,
మళ్ళీఏడాది ఈదారినే వస్తావుకదూ
వచ్చేటపుడు మంచివార్తలు
తీసుకురా." *

ప్రతికవితలోను ఒక దృశ్యాన్ని కళ్ళ ముందు ప్రత్యక్షం చేస్తాడు. ప్రకృతిని మానవీకరిస్తాడు. ప్రతీకవాదాన్ని (Simbalism) కూడా ఉపయోగిస్తాడు.

'నిన్న-నేడు' అనే కవితలో జాతినేత, పూజ్యపిత గాంధీతాతకు తాను లోగడ స్వాగతం పలికానని చెప్పి ఇప్పుడు నువ్వువస్తే మమ్మల్ని చూసిజీవించగలవా? అని అడుగుతాడు. ఇప్పటి దేశపరిస్థితి కళ్ళకు కట్టినట్టు చక్కని అలంకారాలతో, చిక్కని పదజాలంతో, అతిసహజంగా, చిత్రించాడు. అన్యాయం, అవినీతి, ఆశ్రితపక్షపాతం, లంచగొండితనం, క్షుద్రమైన రాజకీయాలు దరిద్రమైన అధికారదాహం, దారుణ మారణహోమాలు! తాండవం చేస్తున్నాయి దేశంలో; ఇది చూస్తే గుండె ఆగి చస్తావు సుమా! ఇది రాక్షసలోకం, శాంతి సీత లేదు; మానవత లేదు, లోకం విషపాకంగా మారిపోయింది. తప్పుడు తూకంగా తయారైంది.

'నడుస్తున్న చరిత్ర'లో ఇలాఅంటాడు.

*నిదురించే దేవుణ్ణి లేపకు
నిప్పులు చిమ్మే నరుణ్ణి ఆపకు
కలాన్ని మత్తులో ముంచకు
కవితను కాంతతో పోల్చకు."
మతాన్ని మూర్ఖంగా కొలవకు
గతాన్ని మళ్ళీమళ్ళీ పిలవకు
నిన్నటినిజం- నేటివిషం
నేటివిషం- రేపటినిజం.

డబ్బుకులోకం దాసోహం అంటారు. అర్థంలేనిదే (ధనం) ఏపనీ అవదు. ఈరోజుల్లో. ధనం మనిషిని మార్చే సాధనం, మంచితనాన్నిసైతం మండించే ఇంధనం.

* చిత్తంస్థానంలో విత్తం పీటేసుకుంది
మేధాశక్తిని స్వార్థసర్పం వాటేసుకుంది.

డబ్బుంటే ఎన్ని చెడుగుణాలున్నా సహిస్తారుజనం, డబ్బు లేకపోతే ఎంత మంచి ఉన్నా గుర్తించదు లోకం. అందుకే శ్రీశ్రీ 'మానవులను పీడించేది, దేవతలను ఆడించేది 'డబ్బు' అంటాడు. నిజమే మరి.

"ఒంటిగా ప్రేమించ లేను" అనే ఖండికలో, కేవలం ఆంధ్ర భాషాయోషనే ప్రేమించలేను. పక్కనున్న చక్కనైన చుక్కలాంటి సంస్కృతాన్ని, హైదరాబాద్‌లో ఉరదూ సాకిని (ప్రియురాలు) చెదురుకనులూ, అనంతరపూరునుంచి కన్నడప్రౌఢగడుసుచనులూ, చిత్తూరునుంచి అరవజవరాలి భరతనాట్యం నడుమూ 'అన్నీ ఒక్కసారి ఆయన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తుంటే అన్నింటినీ ప్రేమించ నారంభించాడు.

మనదేశం అనేక సంస్కృతుల కడలి, అనేక భాషా వాహినుల కూడలి' అని గర్విస్తాడు. ఆరోజు రావాలి 'ఖండికలో' నేటిమనిషి' మనస్తత్వం చెపుతాడు. జీవితమంతా నటననీ, ప్రభుత్వం కూడా శాయశక్తులా నటిస్తోందనీ చెప్పి ఆనటన పోయి నిజజీవితాలు వెలుగులోకి రావాలని, ప్రతీమనిషీ స్వేచ్ఛావాయువులు పీల్చాలని, హాయిగా తలెత్తుకు తిరగాలని కోరుతాడు.

*నేటిమనిషి-
మనిషిలోని మనసు
మనసులోని దినుసు
అంతా పెళుసని అందరికీ తెలుసు
తెల్సీ అంతా నటించేస్తున్నారు
వచ్చీ రాని డైలాగు లన్నీ
పఠించేస్తున్నారు. *

పైపాదాలలో (వాక్యాల్లో) ప్రాస విన్యాసంచేయగా భాష లాస్యంచేసింది. పదాలు నేనువస్తాను నేనే వస్తానంటూ వచ్చి నిల్చాయి. అర్థవంతంగా, సమర్థంగా ఉన్నాయి ప్రయోగాలు. ఏకవితలో చూసినా ఎక్కడో ఒకచోట నవతామానవతలు తొంగిచూస్తాయి. వాటిని మరిచి ఊహాలోకాల్లో తేలడు. 'మట్టిబొమ్మలు'లో ప్రకృతంలా సౌజన్యంతో, సౌహార్ద్రంతో కల్సిమెల్సి 'సమతాగీతాలు' ఆలాపిస్తుంటే, మనిషి మాత్రం కులమత భేదాలు మర్చిపోక, బీద-ధనిక తేడాలు విడ్చిరాక, కొట్టుకుంటూ,తిట్టుకుంటూ మట్టిలోకల్సిపోయేదాక డబ్బుకోసం అధికారంకోసం పెనుగులాడుతు మానవతనే విడిచి, మట్టిబొమ్మగా మిగిలి, మట్టిలో కరిగిపోతున్నాడు. అని సానుభూతి చూపుతాడు అంతా ఒకటే అని సమతా తత్త్వాన్ని ప్రవచిస్తాడు, ప్రబోధిస్తాడు, విశ్వమానవ సౌభ్రాత్రాన్ని ప్రతిపాదిస్తాడు, వేదాంతాన్ని సంక్షిప్తంచేసి సమీక్షిస్తాడు. 'అన్నిపాత్రల పదార్థం ఒకటే అనే యథార్థం తెల్సుకో' మంటాడు. 'మట్టిమట్టి' అని అంటే ప్రయోజనంలేదు గట్టి పట్టుదల ఉంటే మట్టి బంగారం అవుతుందంటాడు.

"రూలు" ఖండికలో. రూలు, పాటి ఒకే వరుసలోవని, ఆరెండిటి లక్ష్యం మనిషిశ్రేయస్సు మానవ ఆరోగ్యాన్ని కాపాడడమే, అంటాడు.

*పాత్ర మలినమైతే
పాలు చెడిపోతాయి
పాలకుడు దుష్టుడైతే
రూలు దుష్టమై పోతుంది.

'కవిత' ఎలాఉండాలో దానిలక్ష్యం, లక్షణం వివరిస్తాడు. కవిత్వంలో సేద తీర్చేగుణం, శక్తినిచ్చే గుణం చైతన్యం కూర్చేగుణం ఉండాలి' అవి లేకపోతే ఆ కవిత ఎలాంటిదంటే..

*సేద తీర్చని కవిత
నిప్పులవాన లాంటిది
శక్తి నివ్వని కవిత
కుళ్ళిన పండులాంటిది

చైతన్యం కూర్చుని కవిత
చీకటి గుయ్యారంలాంటిది.
ఏదీలేని పాట
నరకానికి బాట

'జగచ్చేతన' ఉండాలి లేకపోతే జగతి అంతా నిశ్శబ్దంగా నిస్తబ్ధంగా నిస్తేజంగా, నిర్వీర్యంగా ఉంటుంది. అందం ఉండదు ఆనందం ఉండదు. జగతిలో ప్రతీదీ ద్వంద్వంగా ఉండాలి. అంటే సుఖదుఃఖాలు, అందం. అనాకారితనం (కురూపి) తీయదనం, చేదుగుణం, ఇలాగే అప్పుడు వాటి విలువ తెలుస్తుంది. తనభావాన్ని సూటిగా నీటుగా, తేటగా చెప్పాడు నాలుగు ముక్కల్లో,

* బ్రతుకు జడమై, పదవిజడమై
జీవం జడమై, భావంజడమై
పుడమి జడమై, జడధిజడమై
అన్నీ జడమై కదలక పడివుంటే
జగత్తు అర్థానికి
మహత్తు ఏం మిగులుతుంది?

అనిగమ్మత్తుగా ప్రశ్నించి, మనల్ని ఆలోచింప చేస్తాడు. 'కవిసమ్మేళనం'లో తన స్వాగతాన్ని, సుమనోహర రీతిలో 'ఆలాపిస్తాడు. 'చమత్కృతిలేని నాబ్రతుకు కృతి' అని తననిజాయితీని నిజంగా మనకి చెప్తాడు. కల్లబొల్లి కబుర్లుచెప్పి మనల్ని నమ్మించాలని ప్రయత్నించడు. తియ్యాని అబద్ధాల్ని కవిత్వంలో చెప్పడు. 'తన బ్రతుకుకృతి' అని చెప్పిన కవిత ఈనాటి భారత సమాజ ప్రతిబింబంగా, మ్యూజియంలో పెట్టవచ్చును. అయితే దానికి ప్రభుత్వం అంగీకరించక పోవచ్చును, అదొక ఉత్తమ కళా ఖండం. సజీవచిత్రం. తనవద్ద ఏమీ లేదంటాడు_ తనబ్రతుకు కృతిలో అందమైన ఛందం కానీ, సుందర పదబంధంకానీ, సురభిళ సుగంధంకానీ, అరవింద మధురమరందంకానీ లే వంటాడు. అది జీవిత కావ్యంలో అన్నాడు. వాస్తవంగా తన కవితలో పైని చెప్పిన లక్షణా లన్నీ ఉన్నాయి. ఆయన కవితనిండా, మకరందం కురుస్తుంది కలస్వనంతో కోకిల కలగానం చేస్తుంది. కావ్యం నందన వనమై పారిజాత పరిమళాలు వెదచల్లుతుంది.

'కృతజ్ఞతలు' అనేకవిత ఈనాటి ప్రభుతకు ఒక హెచ్చరిక. మనం సాధించిన ప్రగతికి ప్రతీక. మనదేశపరిస్థితి కొకపతాక. దేశాన్ని ఆవేశంతో ప్రశ్నిస్తాడు సత్పౌరుడుగా, దేశాభిమానిగా, బాధ్యతగల వ్యక్తిగా, బదులుచెప్ప మని అడుగుతాడు_ ఈ తెల్లాంటి మాటలతో, తూటాల్లాంటి మాటలతో, ప్రశ్నలు కావవి ప్రజాస్వామ్య వ్యోమపథంలో విరిసిన మెరిసే జ్యోత్స్నలు. 'జాతిమనస్తత్వాన్ని' బాగా వంటపట్టించు కున్నాడు.

*నావారు నడిచే దారంతటా
పల్లేరు గాయలు
నాతరం పాదాల నిండా
నెత్తురు గాయాలు.*

అని సహేతుకంగా విమర్శిస్తాడు. స్వాతంత్ర్యం వచ్చి పాతికేళ్ళుదాటినా 'అభివృద్ధి' అంతంతమాత్రంగానే ఉందంటాడు.

పసిడిపలుకులు, మిసిమి చెలుకులు అయిన 'చెణుకులు' కొన్ని.

"వేగమంటే జీవితం
లేకుంటే అది జీతం,
వెన్నెలనావ కన్నెపిల్లల కన్నుల్లోకాదు
అన్నంకోన్న ఆకొన్నవాని కన్నుల్లో
కనిపించింది.

"మానిగా కూర్చున్న జ్ఞానికన్నా
మనిషిగా తిరుగున్న అజ్ఞానే నయం."

"చిన్నిదీపాలు" కొన్ని వెల్గిస్తే అవి ఆకాశమంతా ఆవరించి ప్రకాశవంతం చేస్తాయి జగత్తంతా.

( తరువాయి 16 వ పేజీలో )

# సమయబలము

- శ్రీ చల్లా నరసింహారావు.

సురుచిర హాసరశ్మి శుభ
శోభల వెల్గుచుఁ బూర్వతీరక
ర్బురవరరమ్య హార్మ్యమునఁ
బొల్పుగ వెల్వడి వచ్చుచుండి యం
బరమునఁ జీకటింద్లు తొలి
మంటలఁ గాల్చుచుఁ దారిఁజేసి సం
బరమునఁ గాని పింతువు ప్ర
భాత విశాల వికాస వేళలన్.

కీర్తికవచమ్ముతో నీవు కెంపెసంగి
తిమిరపరిపంథిపైఁ బడ దిరుగు నపుడు
గగనమార్గమ్ములో నిన్నుఁ గనులఁ గాంచ
నెవరు సరిపోరు దినరాజ యింత నిజము.

కదలాడు కిరణాలు ముదమార వాలార
వెల్గుతారల నెల్లఁ బెదరఁ గొట్టి
రంగు రంగులతావి ప్రాంజలించుచుఁ బిల్చు
పూల లతల పొల్పు పొగులఁ జేసి
వెన్ను వికీచికొంచు విజృంభించుచు నుండు
నుదధి గాంభీర్యమ్ము నుడుకఁ బెట్టి
శ్రుతిలోన నిల్పుచు సుందరమ్ముగఁ బాడు
పక్షిసంతతి కుల్కుఁ బాయఁ జేసి

యనుపమాకాశ సామ్రాజ్య మావరించి
యలమటింపఁగఁ జేయుచు నవనిఁ గూడ
తెగఁ జెలాయించు చుంటివి తిరుగు లేక
యెంత వరకు సాగించెద విట్టి ధాటి

నీవు నానడి నెత్తిని నిలచియుండి
యొక ముహూర్త కాలమచట నులికిపడితి
వదియె మొదలయ్యె వే మొనీపదము మార్పు
పశ్చిమంబున కప్పుడె వంగుచుంటి.

దినకర! యేకతంబునఁ గ
తించుచునుండెఁ గ్రమంబుగానిటుల్
ఘనకిరణోష్ణ తీక్ష్ణ ,
కాలము నిన్నటు వంచుచుండ నే

మనకరయె గ్రుంగుచుంటివి భ
యంబున; నీగతిగాంచుచున్న నా
మనమునఁ జోద్యమయ్యె; నిఁక
మానవు నున్నతి నూరకుండునే!

భూమి చివర నీవటె పడిపోతివేమి
బూడిద మెయినిఁగ్రమ్మఁగఁ బాడుపడుచు
నెంతపనిఁజేసెఁ గాలము పంతగించి
మంచిరోజు రాకుండునె; మథనపడకు.

( 15వ పేజీ తరువాయి )

మనసు పెంచవలెను, మంచిపంచవలెను
పెంచిపెంచి సుగతి కాంచవలెను
ధనము కన్న జనము, జనముకన్న మనము
మనము కన్న మనము, ఘనము వినుము.
శిలలు కరుగవలయు, కలలుపండవలయు
కలత లడగవలయు, కవితవిన్న,
మంచికవితకన్న మంచిమనసు మిన్న.

అక్కడక్కడ 'ఆరుద్ర'ముద్ర శాలగంగాధర తిలక్ ప్రభావం, కన్పిస్తాయి. అంత మాత్రాన సొంతవాణి, బాణీ లేవన రాదు. చివరగా ఆయనవ్యక్తిత్వాన్ని "వెలుగులోనికి" తెచ్చే ఆయన కవిత్వం లోనే వినండి.

*నిరాశనుంచి వచ్చినా
అందరిలో ఆశల విత్తులునాటి
ఆశయాల చెట్లు మొలిపిస్తాను
వంచన నుంచి వచ్చినా
మంచి మాగాణిని సాగుచేసి
మానవత్వం పంటలు పండిస్తాను
అడవినుంచి వచ్చినా
అరణ్యాలకు సైతం ఉపస్సుధల్ని పంచే
అమరగీతికల్ని రచిస్తాను
కత్తులవంతెన మీదినుంచి వచ్చినా
కాలం కన్నీటిని చెరిపి
కాంతి చరిత్రను సృష్టిస్తాను
చీకటినుంచి వచ్చినా
చీకటిలోకాన్ని వెలుగులోనికి నడిపిస్తాను.

—•••—

# తెలుగునాట వ్యావహారికభాష

– శ్రీ ఎల్. కె. మల్లేశ్వరరావు, ఎం. ఏ.

( గతసంచిక తరువాయి )

మొదట్లో వ్యావహారికాన్ని వ్యతిరేకించిన ఉద్దండ పండితులే సత్యం గ్రహించి వ్యావహారికాన్ని సమర్థించటం ప్రారంభించారు. అటువంటి వారిలో మొట్టమొదట చెప్పుకోదగినవారు వీరేశలింగం పంతులుగారు. గిడుగు వారితో చర్చించి వారి వాదాన్ని అంగీకరించి వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజానికి అధ్యక్షస్థానం స్వీకరించారు. అలాగే చెళ్ళపిళ్ళవారు, మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు,మహామహోధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు, అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరుల వంటివారు దీన్ని సమర్థించారు. గిడుగువారి శిష్యులైన తాపీధర్మారావుగారు కొంతకాలం వీర గ్రాంథిక రచనలు చేసినా తర్వాత గురువుగారి వాదాన్నిగ్రహించి విరివిగా రచనలు చేయడమేకాక 'జనవాణి' పత్రికలో దీన్ని ప్రవేశపెట్టి మొట్టమొదట వ్యావహారికాన్ని పత్రికల్లో ప్రవేశపెట్టిన ఘనత దక్కించుకొన్నారు. నాగేశ్వరరావు పంతులుగారు కూడా చివరి దశలో వ్యావహారిక భాషోద్యమాన్ని సమర్థించి గిడుగు ప్రభృతులకు ప్రోత్సాహాన్నిచ్చారు. చలం, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, చింతా దీక్షితులు, మల్లాది, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, గోపీచంద్ మొదలైనవాళ్ళంతా కథలూ, నవలలూ వ్యాసాలూ రాసి వ్యావహారికాన్ని పటిష్ఠంచేశారు. వ్యావహారిక భాషోద్యమానికి తగిన విధంగా కవితా రచనా రూపంగా మరికొంత బలాన్ని చెప్పకుండానే చేకూర్చినవారు మహాకవి శ్రీశ్రీ.

1968 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం పిహెచ్.డి.పట్టానికి తానే పరిశోధన వ్యాసాల్లో కూడా శిష్టవ్యావహారికాన్ని అంగీకరించింది. పత్రికా రచన, రేడియో, వివిధ ప్రక్రియల్లో రచన వ్యావహారికంలోనే వెలువడుతున్నా కొన్ని విశ్వవిద్యాలయాల పాఠ్యగ్రంథాలుమాత్రం కృతకగ్రాంథికంలో రచింపబడుతూనే ఉన్నాయి. ఈపరిస్థితిలో సమకాలీన భాషకు పాఠ్యగ్రంథాల్లోనిభాషకుగల అంతరాన్నిగమనించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం ఈ విషయం మీద పరిశీలనకు శ్రీ ఎమ్. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతను ఒక భాషాసంఘాన్ని నియమించింది. ఈ సంఘం వారు సమర్పించిన నివేదికను 1974 డిసెంబరులో విశ్వవిద్యాలయం అకడమిక్ కౌన్సిల్ విశ్వవిద్యాలయంలో ప్రామాణిక వ్యావహారిక భాషకు అంటే శిష్ట వ్యావహారిక భాషకు ప్రవేశం కల్పించింది.

తెలుగుపండితలోకంలోభాషాప్రమాణ నిర్ణయంలో ప్రయోగ శరణాః వైయాకరణాః అన్న సంస్కృతాభియుక్తోక్తికి ఎక్కువగౌరవంఉండేది.ఇక్కడప్రయోగమంటే తెలుగు పండితుల దృష్టిలో కవిప్రయోగమనే అర్థం.

భిన్నదశల్లో, భిన్నరూపాల్లో ఉన్న భాషకు ప్రామాణిక రూపం ఒక్కటే ఉంటుం దనికాని, సార్వకాలిక ప్రామాణికత్వం భాషారూపాల్లో ఏదో ఒకదానికి ఉంటుం దనటం కాని సమర్థనీయం కాదు.

ప్రామాణిక భాష ప్రధానంగా మూడు రకాలని బ్లూంఫీల్డ్ వివరించాడు. రచనల్లో లిఖితరూపంలో ఉండే భాషా

భేదం సాహిత్యమాండలికం (Literary standard) దైనిక వాగ్వ్యవహారంలో విద్యావంతులు వాడే భాషా భేదం వ్యావహారిక ప్రామాణికం (eolloquial standard) ఒక భాష వ్యవహారంలో ఉన్న దేశంలో నిర్దిష్టప్రాంతంలోని విద్యాధికులు మాట్లాడే భాషా భేదం ప్రాంతీయ ప్రామాణికం (Regional standard) ఇంటింటికీ గ్రామానికి మార్పులు పొందుతుండే తక్కువ తరగతులవారి భాషాభేదాన్ని స్థానిక మాండలికం Local standard) లేక గ్రామ్యమని గాని వ్యవహరిస్తారు. ఈ భేదాలు కాక ప్రతిభాషకు దశలూ, అవస్థలూ ఉన్నాయి. వీటి పరిణామక్రమంలోనే ప్రామాణిక భాష ఏర్పడుతుంది. సాధారణంగా రాజకీయ ఆర్థిక సాంస్కృతిక సామాజికాది రంగాలలో పురోగతిని సాధించిన మండలాలకు చెందిన శిష్టుల వాడుకలోని మాండలికమే సాహిత్యస్థితికి ఎదిగి ప్రామాణిక భాషకు మూలాధారం అవుతుందన్నది భాషల్ని చారిత్రకంగా అధ్యయనం చేయడంవల్ల స్పష్టమైన విషయం. రాజకీయంగా శక్తిమంతమైన ప్రాంతం తన సంస్కృతిని అధికారాన్ని భాషారూపంలో కూడ ప్రదర్శిస్తుంది. అధికారభాషగా, సాహిత్యభాషగా, బోధనాభాషగా పరిణమించటానికి ఏప్రాంతీయ భాషా రూపానికి చారిత్రక పరిస్థితులు అనుకూలిస్తాయో అదేశాలగమనంలో ప్రామాణిక భాషగా రూపొందుతుంది. సాధారణంగా రాజస్థానాల్లోనూ, విద్యాకేంద్రాల్లోనూ వ్యవహారంలో ఉన్న భాష ఇతర మాండలికాల్ని తోసి రాజని ప్రామాణిక భాషగా స్థిరపడి పెంపొందుతుంది. ఇలా ప్రామాణిక భాష స్థిరపడేటప్పుడు ఇతర మాండలికాలు దానిలో లీనమవుతాయి. లేదా వ్యవహార దూరమవుతాయి.

ఒకసారి ప్రామాణికత్వం సంపాదించిన భాషారూపం శాశ్వతంగా అదే స్థితిలో ఉండదన్నది సజీవ భాషల విషయంలోనూ విద్వాంసులు సృష్టించి వ్యవహరించిన కల్పిత భాషల విషయంలోనూ రుజువవుతున్నది. అనుకూల రాజకీయార్థికాది పరిస్థితుల్లో ఆకాలానికి చెందిన శిష్టవాగ్వ్యవహారంలో సహజంగానూ సందర్భోచితంగానూ ఉచ్చరింపబడిపదజాలం మాత్రం ప్రామాణికభాషగా పరిగణింపబడుతుంది. అటు రచనకూ ఇటు సంభాషణకూ ఉపయోగింపబడుతుంది. సన్నిహిత సాంఘికాది సంబంధాలవల్ల భాషలోవచ్చే ఏకరూపతనే ప్రామాణికమని అంటాం.

ఆధునిక ప్రామాణిక ఫ్రెంచ్ భాష పారిస్ నగరస్థానిక మాండలికం నుంచి ఏర్పడింది. ఆధునిక ప్రామాణిక జర్మన్ భాష తూర్పుసరిహద్దురాష్ట్రాల్లోని అధికార వాణిజ్యభాషా భేదంనుంచి ఏర్పడింది. మాస్కో ప్రాంతపు వాడుకభాష ప్రాతిపదికగా పాతస్లావ్ భాషాంశాలనూ' అన్యదేశాలనూ జీర్ణించుకొని నేటి ప్రామాణిక రష్యన్ భాషఏర్పడింది. నేటి హిందీ బడేబోల్ ఢిల్లీ మాండలికం నుంచి, నేటి వంగభాష (చలత్ భాష) కలకత్తా మాండలికంనుంచి ఏర్పడ్డాయి. అలాగే నేటి ప్రామాణిక తెలుగుభాష సాంస్కృతికంగా, ఆర్థికంగా, విద్యాసంబంధంగా మొదటినుంచీ తనప్రాముఖ్యమును నిలుపుకొంటున్న కృష్ణా గోదావరి జిల్లాల మాండలికాలనుంచిఏర్పడింది. ప్రపంచం మొత్తంలో ఎన్నదగిన సారవంతమైన ప్రదేశాలు గోదావరీ కృష్ణా డెల్టాలు. బ్రహ్మాండమైన నదులూ, సముద్రం, పర్వతశ్రేణులూ ఉండటం వల్ల ఈ ప్రాంతం అన్నిరంగాల్లోనూ అభివృద్ధిని సాధించింది. గ్రియర్సన్ రచించిన లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియాలో కూడా ఈ భాషనే ప్రామాణికంగా పేర్కొన్నాడు. నేటి రేడియో ప్రసంగాలు, వార్తాపత్రికలలో వాడుతున్న భాష ఇదే.

కృష్ణాగోదావరీ నదులకు ఆనకట్టలు కట్టగానే వ్యవసాయం, దానివల్ల ఆర్థిక పరిస్థితులూ సాగరతరంలో అభివృద్ధిపొందాయి. రాజకీయ ప్రాబల్యం చేకూరింది అశేషంగా పత్రికలు బయలుదేరాయి ప్రయాణసౌకర్యాలు ఏర్పడ్డాయి. పాఠశాలలూ కళాశాలలూ అసంఖ్యాకంగా పెరిగి విద్యావ్యాప్తి జరిగింది. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రభావం, ఆంగ్లపాలన వల్ల కలిగిన ఆధునిక సౌకర్యాలు సాగరతరంలో ఎక్కువయ్యాయి. రాజకీయచైతన్యం ప్రజ్వరిల్లింది. కందుకూరి వీరేశలింగంగారు సంఘ సంస్కారాన్ని, భాషాసంస్కరణనీ ఈ ప్రాంతంలోనే ఆరంభించి సాధించారు.

వేదం వేంకటరాయశాస్త్రి గారు పాత్రోచిత భాషపేరిట అవ్యక్తంగానే ఆధునిక భాషారూపానికి స్థానం కల్పించారు. గిడుగు వారి ప్రచారధోరణి గురుజాడ రచనా ధోరణీ ఎందరికో ఆదర్శమయ్యాయి. అనేక సాహిత్యోద్యమాలకూ ఇక్కడే నాంది జరిగింది. ఈనాటివరకూ రచయితల్లో అధిక సంఖ్యాకులు తీరాంధ్ర వాస్తవ్యులే. ఆధునిక ప్రచార సాధనాలన్నీ ఇక్కడేవున్నాయి. అన్ని వసతులు చేకూరినందున తీరాంధ్రభాష 'కోస్తా మాండలికం' నేటి ఆధునిక ప్రామాణిక భాషగా పరిణమించింది.

భిన్నమాండలికాలు వాడుకలోవున్నప్పటికీ విమర్శనాత్మక రచనలు చేసేవారు పూర్తిగానూ, సృజనాత్మకరచనలు చేసేవారు చాలవరకున్నూ పైనిపేర్కొన్న ప్రామాణిక భాషనే తమ ప్రచార

సాధనంగా అవలంబిస్తూ వుంటారు.

ఈ వర్గానికి పురిపండా అప్పలస్వామి. అంగర వెంకటకృష్ణారావు, బలివాడ కాంతారావు మొదలైనవారు కళింగాంధ్రానికి చెందినవారు, రాచమల్లు రామచంద్రారెడ్డి, మధురాంతకం రాజారాం, గంగప్ప మొదలయిన రచయితలు రాయలసీమకు చెందినవారు. నార్ల వెంకటేశ్వరరావు. జి. వి. కృష్ణారావు, కొడవటిగంటి కుటుంబరావు ప్రభృతులు మధ్యాంధ్రానికి సంబంధించినవారు. కాళోజీ నారాయణరావు. సి. నారాయణరెడ్డి, కోవెల సుప్రసన్నాచార్య వగైరాలు తెలంగాణావారు. అయినా తమ ఇష్టానిష్టాలతో ప్రమేయంలేకుండా ప్రాయికంగా స్వీయ మాండలికాలకు అతీతులుగా ప్రామాణిక భాషనే తమ భావ ప్రకటనకు వాహకంగా స్వీకరించి తమ రచనా రంగాలలో తదితర వ్యాసంగాలలో నియతంగా వాడుతున్నారు. అయితే అలవాటుగానో లేక సరదాకో చాదస్తానికో కొన్ని మాండలికాలు కొన్ని యాసలూ, కొన్ని పడికట్టు పదాలు కొందరి రచనల్లో అడపా తడపా దొర్లితే దొర్లవచ్చును. కాని వారి ప్రధాన భాషాప్రయోగరీతిమాత్రం ప్రామాణిక భాషాపథం సరసనే పయనిస్తూ వుంటుంది, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రజలభాషలోపరిపాలనజరగాలని నిర్ణయించడం ముదావహం. దీనివల్ల తెలుగు భాష నవోన్మేషంగా పరిపుష్టంకాగలదు. 'ఉపయుక్త గ్రంథకర్తలందరికీ, ప్రత్యేకించి డా. బూదరాజు రాధాకృష్ణగారికి కృతజ్ఞతలు.'

—...—

# గ్రంథ సమాలోచన

## ప్రాఙ్నన్నయ యుగము - సాంఘిక జీవనము.

(రచయిత శ్రీ. నండూరి వేంకట సత్యరామారావుగారు. ఆంధ్రోపన్యాసకులు. ప్రభుత్వ కళాశాల. తాడేపల్లిగూడెం. వెల రూపాయన్నర. )

తెనుగుభాషలో నన్నయ వాల్మీకివలె నాదికవియైనాడు. వాని ముందుగల వాఙ్మయము కేవలము శాసనైక లభ్యమానమై యున్నది. అట్టి శాసనము లాధారముగ నాటి సాంఘికజీవనము వెల్లడించుటకు శ్రీ నండూరి వేంకటసత్యరామారావుగారు 'ప్రాఙ్నన్నయ యుగము- సాంఘిక జీవనము అను నిరువది మూడు పేజీల పరిశోధిత వ్యాసమును రచించి తెలుగు సాహితీ సమాఖ్యవారి సహకారముతో ముద్రించిరి. దీనికి మంగళాశాసనం శ్రీ జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి (శాంతిశ్రీగారు) తొలిపలుకు (శ్రీ.తి. రామానుజాచార్యులుగారు) నామాట (రచయిత) అను నాయ పేజీ లనుబంధముగా గలవు. మంగళాశాసనములో 'ఆర్ధికపుష్టి' ముద్రారాక్షసము కావచ్చును. 'శ్యామలప్రియ' అట్లుకాదు. నామాట'లో కృజ్ఞతలు అతివేలం అయినట్లున్నాయి.

శాసనము లాధారముగా నాటి సాంఘిక జీవనమును చిత్రించుట (వివరించుట) మిక్కిలి కష్టము. సాంఘికజీవనమనగా నాటిప్రజల యాహారవిహారములు, వినోదములు, కట్టుబొట్లు, దోషములు, శిక్షలు, దానధర్మములు, అలవాట్లు నాటిసాహిత్యము, భాషమున్నగు నవియందు చేరును. రచయిత వాని నన్నిటిని నిరూపింపలేదు. రాజకీయ పరిస్థితియు గొంతవరకైన సాంఘిక మగును. దాని నసలు స్పృశింపనే లేదు. శీర్షికలు విభజించినచో మరింత బాగుండెడిది. శాసనములనే అధారముగ గొని యిన్నిటిని సాధించుట కష్టమే యైనను మరి యిది పరిశోధిత వ్యాసము గదా! పరిశోధక వ్యాసముగూడ నైనది. ఇది వారి పరిశోధనలోని మచ్చుమాత్రమే. ఇందు వీరికృషి ప్రశంసనీయము. శాసనములపై శ్రీశ్రీ బూదరాజువారి "ప్రాచీనాంధ్ర శాసనాలు" తమకు బాగుగ నుపయోగించిన దనిరి. దీనిపై మరియితరుల ప్రాచీనుల గ్రంథములు లేవా చూడలేదా? మరియు శాసనముల నుదాహరించుచో పంక్తిని యథాతథముగ నిచ్చుట కంటె ప్రకృతోపయుక్త భాగము నిచ్చిన బాగుండెడిది. వదలిన భాగమునకు చుక్కల గుర్తునో మరయొక గుర్తునో పెట్టిన బాగుండెడిది. నాలుగవ పేజీలోని శాసనోదాహృత భాగములో "గారి (కొడు)కు (జె) జెయరాజు ... ఇందు క్రీగీటుగలభాగము ప్రకృతోప యోగి కాదుకదా!

ఇందు రచయిత శ్రమ ప్రత్యక్షరమున సాక్షాత్కరించి ప్రశంసనీయ మగుచున్నది. వీరు త్వరలో మిగిలిన తమ పరిశోధన వ్యాసమును గూడ ప్రకటింపగలరని యాశింపవచ్చును. ఇట్టివానిని ప్రకటింపబూనిన సాహితీసమితి యక్షరకృషి యక్షరకృషియై ప్రశంసనీయ మగు చున్నది.

## షడ్దర్శనములు

[రచన: శ్రీ. S. T. G వరదాచార్యులుగారు. అనుబంధవ్యాసము శ్రీ దేవత సుబ్బారావుగారు. వెల రెండు రూపాయలు. అధ్యాత్మ సాధక సమితి 55 ఎ. ఎన్. హెచ్. 4 బి. M. E. L. రామచంద్రపురం. హైదరాబాదు.)

మనుష్యుడు జ్ఞానంవలన పశువుకన్నా వ్యతిరిక్తుడు. అట్టిజ్ఞానమును దీప్తము జేసి మానవుని తత్త్వోన్ముఖుని జేయునవి దర్శనములు. ఈ దర్శనపరిజ్ఞానం పరిమితజనోద్దిష్టం. సంగీతాదులవలె ప్రతివారికి నిది ఆనందాన్నీయదు. వస్తుతః పరిశీలించినచో సంగీత సాహిత్య పరమావధి తత్త్వదర్శనమే. త్యాగరాజు లాటివారు అటువంటి దార్శనికులు. జ్ఞానప్రధానమైన మనభారతదేశమున తత్త్వదర్శనమున కుపయోగించు దర్శన పరిజ్ఞానము కతిపయ పండితజన సంక్రాంతమైయున్నది. ఒక్కొక్క దర్శనమును తెలిసికొనుటకు అర్హుడైన వ్యక్తికే చాల కాలము పట్టును. అట్టి స్థితిలో నాస్తిక దర్శనముల తత్త్వముల రెండింటిని సంగ్రహప్రాయముగ కేవల సిద్ధాంత మాత్ర ప్రదర్శనతో శ్రీ S. T. G వరదాచార్యులుగారు శ్రీ దేవత సుబ్బారావుగారు (అనుబంధవ్యాసము) ఈవిధముగా నిర్వహించిరి. ఒకే విషయముపై నిద్దరి వ్యాసములను ప్రకటించుకంటె నొకరిచేతనే వ్రాయించినచో నిరువదిరెండు పేజీల గ్రంథములోను చర్విత చర్వణాదులు కొంతవరకు తగ్గియుండెడివి.

శ్రీవరదాచార్యులుగారు పేరందిన పండితులు. అట్టివారి రచన మరింత విపులముగా స్యాద్వాదాదులవివరణతో నున్నచో బాగుండెడిది. లేదా శ్రీదేవత వారును ప్రసిద్ధులే. వారే పూర్తిగ దీనిని నిర్వహించినను బాగుండెడిది. వాక్య రచనా విధాన మిద్దరిలోను మారినది.

ఇందు జగదుత్పత్త్యాధి కారణత్వము, బ్రహ్మబావము శక్తివంతమువంటి ప్రయోగము లున్నవి. కొన్ని ముద్రారాక్షసములు కావచ్చును. శ్రీ ఆచార్యుల వారుత్తరమీమాంసా వివరణలో శ్రీ శంకర రామానుజానంద తీర్థులను మాత్రమే గ్రహించుట మిగిలిన మతముల విడచుట విచిత్రముగా నున్నది. మిగిలినమతము లవైదికములనియో నాస్తికము లనియో వారియూహ కావచ్చును. వానినిగూడ పేర్కొన్నచో సమ్యగ్దర్శనమయినట్లుండెడిది. ఆయా దర్శనముల సారము నిచ్చుటేకాక వానిలోని ప్రసిద్ధగ్రంథములను రచయితలను గూడ పేర్కొన్న బాగుండెడిది. ఇట్టి ప్రయత్నము మరింత సమ్యగ్దర్శనముతో జేసిన గ్రంథము మరింత రాణించెడిది.

ఏమైన నీప్రయత్నము ప్రశంసనీయము. ప్రాథమిక దశలోని జిజ్ఞాసువులకు మరింతవివరణాత్మకమైనచో మరింత లాభించెడిది. 'శ్రీ ఆచార్యులుగారిభాష మరింత సరళమై వివరణాత్మకమైనచో సామాన్యులును లబ్ధిని పొందెడివారు. అధ్యాత్మసాధక సమితివారి యత్నము ప్రశంసనీయము. వీరింకను నిట్టి గ్రంథముల ననేకములను వెలువరింపగలరని కోరదగును. ఆధ్యాత్మిక పరిజ్ఞానమునకై భాషాసారళ్య మవసర మని గుర్తించుట యావశ్యకము. ఇట్టి గ్రంథముల యవసర మిప్పుడు దేశమునకెంతైన గలదు. అందలి వీరికృషి ప్రవృద్ధమై ప్రవర్ధమానమై ప్రవర్ధిష్యమాణ మాణము కాగలదని ఆసింతము.



ఆంధ్ర హోమియోపతి స్టోర్సు & హాస్పిటల్

(నాళంవారి సత్రం ప్రక్క, ఎల్. ఐ. సి. ఆఫీసు ఎదుట)

మెయిన్ రోడ్డు – రాజమండ్రి-533 101.

స్థాపితము : 1933) ఫోన్ నెం. 4698

సలహా వైద్యులు : డాక్టరు యం. రామకృష్ణారావు

మేనేజరు : డా॥ కె. కృష్ణ

ప్రశస్తమైన అమెరికన్, జర్మను, ఇండియన్ హోమియోపతిక్ అండ్ బయోకెమిక్ మందులు అన్ని పవరులలోను అన్నిరూపములలోను సరసమైన ధరలకు దొరకును.

సర్వవిధవ్యాధులకు చికిత్స చేయబడును, సలహా లీయబడును.



## పసిపాప - పరిరక్షణ

విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు, ఎం.ఏ.

పరమ పవిత్రదాంపత్యానురాగస
త్ఫలరూపమే పసిపాప యనఁగ
దైన్యదర్భర జీవిత ధ్వాంతనిశకును
పండు వెన్నెల పసిపాప యనఁగ
అమిత [illegible]తృష్ణాతి బాధాశ్రిత
పానీయమే పసిపాప యనఁగ
అతులనిరాశోప హత దుఃఖమతులకు
భాసురాశయె పసిపాప యనఁగ
ఎద్దుమొద్దులకైనను ముద్దుమాట
భాగ్య దేవతయే పసిపాప యనఁగ
భావమరసినచోఁ బసిపాప యనఁగఁ
బసిఁడి పాపయె బంగారుపాప పాప.

పసిపాపయే పరబ్రహ్మస్వరూపంబు
పసిపాపయే భగవంతు నకలు
పసిపాప లేనట్టి భవనము భవనమే
పాడువాటిన పట్టిబీడుగాక
పసిపాప హృదయయే పరమపావనమాట
దైవ మందుండు నుత్తమవిధమున
పసిపాప అవ్యక్త వాక్యంబులే యగు
బ్రహ్మసూత్రంబులు ప్రస్ఫుటముగ
మాయామర్మము లెఱుఁగని మంచిమనసు
లమలదృక్కులు పసిపాపలనఁగ జగతి
పలుపలుకులేలొకో పసిపాపలనఁగ
నమృతఘుటికలు మిగులఁదియ్యని చిలుకలు.

పసిపాపలకు నిత్యపరిక్ష యొసఁగుచే
తల్లిదండ్రులకుఁ గర్తవ్య మెందు
పసిపాపలను దివ్య భావిపౌరులు గాఁగఁ
జేయుటే మనయుపాధ్యాయుల విధి

పసిపాపలకు రోగభయము లేనటు వైద్య
సదుపాయములు చూపజను ప్రభుత్వ
మనుపమారోగ్యంబు నందిన శిశువులే
భావిపౌరులుం ప్రజాప్రభువరులును

తనువునకెకాక బుద్ధికి మనసునకును
దగినయాహార మీయఁగఁ దగును వారి
కనవరతమును దేశభాగ్యంబు వారె,
జయముజయమూత! శిశులోకచయమునకిల.

---

# ఈ పక్షంలో

## సమ్మానము

ఇటీవల రాజమండ్రి శ్రీ లక్ష్మీనరసమ్మ కాన్వెంటులో ఎ. ఐ. ఆర్. విమర్శకులు శ్రీ ఆర్. ఎం. చల్లా అధ్యక్షతను జరిగిన సభలో డాక్టర్ మృత్యుంజయరావుగారికి సమ్మానం జరిగింది. నాదస్వర గానంతో సభ ప్రారంభమయింది. విద్వాన్ బ్రహ్మశ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు సభా ప్రారంభం గావించుచు డాక్టర్ రావుగారి కృషిని వివరించి, ప్రశంసించారు.

సమితి సహాయ కార్యదర్శి శ్రీనిమ్మలపూడి వీరరాజు డాక్టర్ రావును సభకు పరిచయం చేశారు.

అనంతరం శ్రీ వీరరాజు ప్రధానాతిథిని చందన తాంబూలాదులతో, పుష్పమాలలతో దుశ్శాలువలతో సమ్మానించారు. డాక్టర్ మృత్యుంజయరావు తమకు చేసిన సమ్మానానికి ఛందోరూపంలో సముచితంగా కృతజ్ఞత తెలిపి, ‘వ్యాసభారతము నన్నయపరిష్కారము’ అను అంశంపై సుదీర్ఘమైన ఉపన్యాసం చేసారు. వ్యాసభారతం ఇతిహాసం, పురాణం అనీ అందులో ధర్మోపదేశ ప్రచారాలకు ప్రాధాన్యం అనీ, ఆద్యాంధ్ర కవియైన శ్రీనన్నయభట్టారకులు దానిని కావ్యంగా తీర్చిదిద్దడానికి అనేకవిధాల ప్రయత్నం చేసి కృతకృత్యుడయినారని డాక్టర్ రావు తమ సోదాహరణ ప్రసంగంలో నిరూపించారు. వ్యాస భారతంలోని పెక్కు ఘట్టాలను శ్రీనన్నయ అనువదించిన తీరు చూపి డాక్టర్ రావు వాటిలో నన్నయ చేసిన చమత్కారాలూ, సొగసులూ విశదీకరించి వ్యాస భారతం నన్నయ చేతిలో ఎట్లా అలంకృతం అయినదీ సహృదయ హృదయంగమంగా నిరూపించారు. సభకి నగరంలోని విద్వాంసులు, కవులు చాలమంది విచ్చేసారు.

డాక్టర్ రావుగారిని గూర్చి, వారు చేసిన యీ మహాసాహితీ వ్యవసాయాన్ని గూర్చి శ్రీ మెరపల సన్యాసిరావు, శ్రీ మల్లంపల్లి మల్లికార్జున ప్రసాద్, సమితి అధ్యక్షులు శ్రీ బుగ్గా పాపయ్య శాస్త్రి, పత్రికాలేఖకులు శ్రీ ఆర్. బి. పెండ్యాల, అవధానివరేణ్యులు శ్రీ గాదేపల్లి కుక్కుటేశ్వరరావు, శ్రీ చేబోలు శేషగిరిరావు, ప్రశంసించారు.

సహాయ కార్యదర్శి శ్రీ చింతపెంట సాంబశివరావు వందన సమర్పణతో కార్యక్రమం విజయవంతంగా ముగిసింది.

---

# బి. వి. అండ్ కో., పుస్తకములు

1979 — 80 ఇంటరు, డిగ్రీ తరగతుల అన్ని తెలుగునోట్సు వీలయినంత త్వరలో విడుదల చేయబడును.

**బి. వి. అండ్ కో.,**

6-8-7, ఇన్నీసుపేట
రాజమండ్రి-1.

## —* రచయితలకు మనవి *—

సంక్షేపముగను, సౌమనస్యముతోఁ గూడినవిగాను, నుండు విమర్శనాత్మక రచనలకు స్వాగతము. గ్రంథవిమర్శకుఁ బ్రాముఖ్యము. ఔచిత్యము మీఱని అభిప్రాయ భేదములకు సముచిత గౌరవము. వాఙ్మయమునఁ జేరఁదగు వివిధాంశములపైఁ దమ రచనలు పంపి మాకుఁ జేయూఁతనీయఁ బ్రార్థన. రచనలు సరళగ్రాంథికములోఁ గాని, శిష్టవ్యావహారికములోఁ గాని యుండవచ్చును. సలక్షణములు రసవంతములు నగు పద్యరచనలకు ప్రత్యేక స్వాగతము.

సమాలోచనముపట్ల ఆదరాభిమానములతో రచయితలు సంపూర్ణ సహకార మొసగుచున్నందుకు సంతోషము. రచన లతిదీర్ఘములై 'సశేషములు' కాకుండునట్లు ప్రయత్నించుట మిక్కిలి అవసరము.

వివిధ ప్రక్రియలకు సంబంధించిన సంగ్రహ రచనల నాహ్వానించుచున్నాము. సమాలోచన గ్రంథవిమర్శకు (సమీక్షకు) ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చును. సమీక్షకు పంపు గ్రంథములు రెండేసి ప్రతులు పంపవలయునని గమనింపఁ గోరిక.

- సంపాదకుడు.

సంపాదకుడు, విద్వాన్ బాలుసు సీతారామశాస్త్రి,

Retired Telugu Lecturer, V. T. J. College,
6-8-7, ఇన్నీసుపేట (త్యాగరాజ నగర్), రాజమండ్రి-1.

## —* 'సమాలోచన' ప్రకటన రేట్లు *—

| | | | |
|---|---|---|---|
| కైటిలు 4 వ పేజీ పూర్తి పేజీ ఒకసారి ప్రకటనకు | | రు. | 150. |
| ,, ½ పేజీ | ,, | రు. | 80. |
| ,, ¼ పేజీ | ,, | రు. | 50. |
| మిగిలిన పేజీలలో పూర్తి పేజీ | ,, | రు. | 100. |
| ,, ½ పేజీ | ,, | రు. | 60. |
| ,, ¼ పేజీ | ,, | రు. | 40. |

కంట్రాక్టు రేట్లకు సంపాదకుని పేర వ్రాయండి.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.